# తారాపదం

| | |
|---|---|
| చరణదాస్<br>శాంతారావు<br>వినాయకరావు<br>గోకుల్‌దాసు<br>శ్యామ్<br>సరోజిని | ముఖ్యపాత్రలు |
| భారతి<br>రజని<br>రాధ | సరోజిని పాత్రధారిణే పేర్ల మార్పుతో వ్యవహరిస్తుంది. |
| కవిజి<br>శాస్త్రి<br>యోగి<br>ఆచారి<br>కాపు<br>షావుకారు<br>రాముడు | చిన్నపాత్రలు. |

# చరణదాస్

## 1 వ దృశ్యము

( పుష్పమును చేతిలో త్రిప్పుచు ఆలోచనానిమగ్నుడై కవి ప్రవేశించును )

గేయం

పూలసొగసే మధురం!
పూలబ్రతుకే మధురం!!
వలపు ఏటిలో
కులుకుపలుకులో
కన్య కాంతులో
కదిలి మెదిలే
పూలసొగసే మధురం!
పూలబ్రతుకే మధురం!!
ప్రేమ కెరటాల
విరహనావికల
పరిమళ కాంతుల
తేలియాడే
పూలసొగసే మధురం!
పూలబ్రతుకే మధురం!!

కవి:—ఈపుష్పాని కెంత సౌందర్యమున్నది. ఆ సౌందర్యములో మాధుర్యము, సంగీతము మిళితమైనాయి. సంగీత సౌంద

ర్యాలలో నుయ్యాల లూగే సమర్థత ఈ కాడ కుండి మధురముగా నృత్యము చేసే యౌవనత్వాన్ని చూచి ఆమాధుర్యాన్ని, సంగీతాన్ని, సౌందర్యాన్ని అనుభవిస్తూ ఆ నృత్యములో లీనమయ్యే ప్రవృత్తియు మాత్రము మానవజాతికి లేదు. మానవదృష్టి నభోమండలాన్ని దాటపోతోంది. హృదయము మాత్రము పాతాళలోకములో భయంకరసర్పాలతో సహవాసము చేస్తూ సహజకోమలత్వాన్ని పోగొట్టుకొంది. శాస్త్రాలతో స్పర్ధ చేయలేక కళ చితికిపోయి నశిస్తోంది.

(కన్నీరు కార్చుకుంటూ సరోజిని ప్రవేశించును.)

కవి:—సరోజ! ఈ భయంకర స్వరూప మేమిటి? సౌందర్యదేవతకు నీరాజనమిచ్చే నీ నేత్రాలు భయంకరమేఘాలై కుంభవృష్టిని కురిపిస్తున్నాయే!

సరో:—మీ పిచ్చికవుల ఉన్మత్తగీతాలవల్లన ప్రవహించే పీయూషము.

కవి:—అందులో కూడా ఆనందమున్నది కవికి.

సరో:—కవీ! నీ పిచ్చిబుర్ర కట్టిపెట్టి నన్ను ఆపదనుండి రక్షించు.

కవి:—విషాద గాథలలోకూడా సౌందర్యముచూస్తేనే కవి.

సరో:—నీవు వ్రాసిన భావగీతాలు మా మానేజరు చేతిలో పడ్డాయి.

కవి:—మంచిదే. కవిలేఖినిలో గల మహిమ ఆమె కర్థమౌతుంది, కవయిత్రులు బయలుదేరే సదవకాశము లభిస్తుంది.

సరో:—పిచ్చికవీ! పాతకాలంనుంచి స్వస్తిచెప్పారు. నేను సృష్టించుకొన్న ఆశాసౌధాలన్ని అనుమానజ్వాలాగ్ని బూడిద చేస్తోంది. ఆర్పేమార్గము చూడు.

కవి:—సరో! ఆశాసౌధాన్ని మింగుతూ ఆనందంతో నాట్యమాడే ప్రచండవాయువు ప్రాణమిత్రుణ్ణి చూస్తే కవి కుమారుల లేత హృదయాలలోంచి అత్యద్భుతమైన కవితా ప్రవంతి బయలుదేరుతుంది. అటువంటి అవకాశమిచ్చిన నీ జన్మ ధన్యమైంది.

సరో:—కవీ! నీ పిచ్చిసిద్ధాంతాలను విని ఆనందించే సమయము దాటిపోయింది. సంఘానుమానమనే భయంకర సముద్రము అవమానభంగాలతో విజృంభించి బలిద్దామని తరుము కొని వస్తోంది. ఆ ఆపదనుండి రక్షిస్తావని నీదగ్గరకు వచ్చాను.

కవి:—సరో! ఆ సముద్రాన్ని తిలకించి, ఆ తరంగాలను ఎదుర్కొని అభిముఖులవై ఊపులూగే అదృష్టము నీకే పట్టిందంటే నాకెంతో ఆనందముగా ఉంది. ఆ సముద్రములో నభోమండలముమీద ఈ గందరగోళముతో సంబంధము లేకుండా విరాజిల్లే కళాధరునిమాస్తనుగా సంచరించే అదృష్టము నీకు పట్టిందంటే ఇంతకంటె కావలసిన దేముంది. ఒక నాటకము వ్రాసి దిగంతయశము పొందుతాను.

సరో:—కవీ! కొంప అంటుకొని పోతున్నా నీ కవిత్వ రోగాన్ని వదలవా! లే, ఆ మంటలను ఆర్పి, భస్మమయ్యే ఆప్త బంధువులను రక్షించు!

కవి :—భయము లేదు. దేవాసురసంగ్రామాన్ని చిత్రించి వాల్మీకి ఆది కవి యైనాడు. ద్రౌపదీ విషాధగాధను వర్ణించి వ్యాసుడు భగవానుడైనాడు. సీతమ్మ శోకాన్ని మించిన శకుంతలా బాధను వర్ణించి కాళిదాసు కవికులాలంకారుడైనాడు. ఆ సరోజినీ జీవితాన్ని సృష్టించి (కావ్యరూపములో) ఈ కవి అమరత్వాన్ని పొంది ఆధునిక కవితాలోకానికి కాళిదాసవుతాడు.

సరో :—ఆ రాక్షసులు కత్తులు, కర్రలతో తరుముకొని వస్తున్నారు.

కవి :— (తనలో) ధన్యుడవు కవీ! చిరస్మరణీయమైన గీతాన్ని లోకానికందిచ్చే సదవకాశము కల్గింది.

(ఇంతలో శాస్త్రి ప్రవేశించును)

లోపలకు రావచ్చునా !

కవి :—శాస్త్రీజీ ! రండి లోపలకు !

సరో :—ఈ కుక్క ప్రచారము సాగించి అనుమానము లేకె త్తజేశాడు.

శాస్త్రి :—కవిగారూ ! ఈ అమ్మాయి మీ శిష్యురాలా !

కవి :—కాదు, నా హృదయవిశ్వంభరలో నిగూఢముగా దాగి ఉన్న భావరత్నాలను పైకి లాగి మెరుగుపెట్టి లోకాల కందిచ్చే అమరజ్యోతి.

శాస్త్రి :—కవీజీ ! క్షమించాలి. మీకవిత్వాన్ని కట్టిపెట్టి నేనడిగే ప్రశ్నలకు సమాధానముచెప్పాలి.

కవి :— కవిః ఉచాలి. కవిత్వము లేని కవి లభ్యంకాడు. ప్రతి క్షణము కవిత్వ మాతనిలోనించితీవ్రవేగముతో వస్తుంది. దాన్ని ఆపటము కష్టము.

సరో :—కవిగారూ ! ఈ పాడు కవిత్వముతో నన్ను చంపక నేను మీ శిష్యురాలనని చెప్పండి!

శాస్త్రి :—కవిగారూ ! ఈ సరోజిని విషయములో మాట్లాడటానికి వచ్చాను.

కవి :—స్వాగతము !

శాస్త్రి :—ఈ పద్యాలు మీరు వ్రాసినవేనా !

కవి :—చదవండి !

శాస్త్రి :—మీరే చదవండి.

కవి :—సరోజినీ ! నీవు చదువు. శాస్త్రిగారూ ! మా సరోజిని చదువుతుంటే ఇంకొక ప్రపంచములో సంచరిస్తాము.

శాస్త్రి :—సెలవు !

సరో :—కారణము.

శాస్త్రి :—కవిగారికి వారి సరోజినికి మధ్య మే ముండకూడదు. ధర్మశాస్త్రా లంగీకరించవు.

సరో :—ప్రార్థిస్తా, నన్ను సరిగ్గా అర్థము చేసికోండి శాస్త్రిజీ!

కవి :—శాస్త్రిజీ ! ఈమె నా హృదయాధిదేవత. సౌందర్యోపాసదేవత. నా హృదయ సరోవరములో రహస్యముగా నిద్రించే భావాలను పైకి లాగి లోకానికి కానుకగా ఇచ్చే పూజ్యదేవత.

శాస్త్రి:—విన్నావా, అమ్మా! ఇంకా అర్థముకాని దేమున్నది? భార్యాభర్తలు. సంఘమంగీకరించని సంబంధము. సెలవు. (అని వెడలిపోవును.)

సరో:—శాస్త్రీజీ—వెడలిపోయాడు. ధర్మాన్ని రక్షిస్తున్నానని ప్రజలను నమ్మించటానికి బాధపడే పండితమాన్యుడు. కవీ! నీ పాడుకవిత్వముతో నా భావిజీవితాన్ని తగలబెట్టావు. లేతవయస్సులోనే కళంకాన్ని అంటగట్టి సంఘానికి దూరం చేశావు. ఇప్పటికైనా కనితీరిందా?

కవి:—ఇప్పుడెంత అందముగా ఉన్నావు సరో!

సరో:—కవీ! మొసమూడికిపోతోంది. నీ పాడు కవిత్వాన్ని—అమాయకుల జీవితాన్ని అధఃపాతాళానికి త్రొక్కే—ఈ పాడుకవిత్వాన్ని పాతిపెట్టి, పొట్టకూటికి భిక్షాటనము చెయ్యి—సెలవు. (అని ఆవేశముతో వెడలిపోవును)

కవి:—హాలాహలాన్ని చూచి బెదిరిపోతోందా అప్సరస. తర్వాత అమృతపురుచి చూచినప్పుడర్థమవుతుంది. హంస తూలికాతల్పముమీద పవళించి ఆనంద మనుభవించాలని ఆశిస్తుందీ పాడులోకము. ఆనంద మనుభవించటానికిముందు రక్తాన్ని స్వేదబిందువులుగా మార్చే శ్రమ కావాలి. కవికి సుఖదుఃఖాలు లేవు. కాలకూటవిషములో మాధుర్యము, క్రూరాహిదంష్ట్రలలో సౌందర్యము, పంచస్వరాలలో సంగీతము, యమ మహిషాగమనములో నృత్యము కవి తిలకించి ఆనందిస్తాడు, కవిత్వము సామాన్యుల కర్థముకాదు. అదొక అజ్ఞాతవాసము.

( తెరలో గానము )

గేయం

నీవె ధన్యుడవోయి కవీ!
నీవె పూజ్యుడవోయి కవీ!
నీ కవనంబె ప్రజలకు హితవు
నీ గేయంబె ప్రజలకు హాయి!
నీవె ధన్యుడవోయి కవీ!
నీవె పూజ్యుడవోయి కవీ!
స్వార్థములేని త్యాగమయంబౌ
కావ్యగానము చేసీ!
నీవె ధన్యుడవోయి కవీ!
నీవె పూజ్యుడవోయి కవీ!
హీనపథాలకు హితమతి వగుచు
జాతి కిడకోయీ—కోత
నీవె ధన్యుడవోయి కవీ!
నీవె పూజ్యుడవోయి కవీ!

# 2 వ దృశ్యము

( కాళికాలయములో యోగి ప్రార్థన చేయుచుండును )

గేయం

సర్వమంగళనామ శంకరు భామా రావా
సర్వవినుతా! నిగమవందితా! రావా! రావా!
భక్తిమీరగ ఆసి పాడి వేడి
బ్రోవమని నీపాలబడితిని మాతా! మాతా!
పాపపంకిలములోన బడుచు లేచుచు
స్వర్గమునకు దూరమైతిమి మాతా! మాతా!
భక్తసంతతినెపుడు బ్రోచే మాతా!
శక్తినిశోధించకమ్మ మాతా! మాతా!
సర్వమంగళనామ శంకరు భామా రావా
సర్వవినుతా నిగమవందితా రావా! రావా!

యోగి:—తల్లీ! రా! ఆ విగ్రహములోంచి వెలుపలకు వచ్చి నీ ఆర్తత్రాణ పరాయణత్వాన్ని రుచిచూపించవలసిన దినాలు వచ్చాయి. నీవు సృష్టించిన ప్రపంచములో పాపము స్వేచ్ఛగా విహరిస్తూ నీఆలయములోనే నీభక్తులచేతనే ఘోరాన్యాయాలు చేయిస్తోంది. అధర్మము నీ సమక్షాన్నే ధర్మముభుజాలపై స్వారి చేస్తూ ఉత్సవాలు చేయించుకొంటోంది. నీ సామ్రాజ్యములోనే అవివాహితులు, విధవలు, కళంకితులై అహోరాత్రాలు విలపిస్తు

న్నారు. అయినా, నాకేమీ సంబంధము లేదని శిలారూపము ధరించి కూర్చున్నావు. హా! ఆపద లన్నివైపులా ముట్టడించి నా అనేవాళ్ళు లేక నీ పాదాలు పట్టిన అనదలకు అభయహస్త మియ్యి. తల్లీ!

( సరోజిని రక్తముతో తూలిపడును )

యోగి :—ఎవరు! —భయము లేదమ్మా !— ఈ భయంకర స్వరూపమేమిటి?

సరో :—సంఘము వ్యక్తులమీద చూపించే రాక్షస కృత్యము—సత్యాన్ని బాహుబలంమీద తేల్చాలనే మూఢ విశ్వాసము.

( శాస్త్రి, ఆచారి, శావు, షావుకారు దేవాలయములో ప్రవేశించెదరు )

శాస్త్రి :—స్వామీజీ !

యోగి :—ఏమి నాయనా!

ఆచారి :—బాబూ! ఆ చండాలురాలిని స్పృశిస్తే వంద జన్మలుదాకా నరకము తప్పదు. దేవాలయములోంచి అవతలకు గెంటివేయండి.

శావు :—జాతికి జలాంజలి యిచ్చిన కులట.

షావు :—నోరు విప్పితే అన్నీ అబద్ధాలే.

యోగి :—నాయనలారా! ఈ ప్రపంచములో పుణ్యాత్ములు అరుదు. పాపాత్ములను ప్రేమించి సంస్కరించటము మన విధి. వేయికత్తులు సాధించలేని పనిని ఒక మంచిమాట సాధిస్తుంది.

ఆచారి :—బాబూ! తమరు గౌతముని ఆశ్రమములో ఉండవలసిన వారు. మీరు చెప్పినదాంట్లో తప్పేమీ లేదు కాని, ఇల్లాంటి వ్యభిచారిణిని క్షమించకూడదు. ప్రేమిస్తే దేశము తగల బడుతుంది.

శాస్త్రి :—పొరపాటుకు ప్రాయశ్చిత్తము కాని, కావాలని చేస్తే ప్రాయశ్చిత్తమేమిటి?

సావు :—క్షమించటానికి వీలు లేదు. ఇల్లాగ క్షమించటం వల్లనే దేశము ఈ స్థితిలోకి వచ్చింది. ఒకణ్ణి గట్టిగా శిక్షిస్తే రెండవవానికి బుద్ధివస్తుంది.

యోగి :—ఇది అమ్మవారి దేవాలయము జగజ్జనని తన యుల దోషాలను సంస్కరించుకోగలదు. ఈ వృధాహంకార ముతో బాధపడి రాబోయే స్వర్గాన్ని ఎందుకు పోగొట్టు కొంటారు?

శాస్త్రి :—స్వామీ! ఈ అమ్మాయి చెప్పటానికి, విన టానికి, సహించటానికి, భరించటానికి వీలు లేనంత పాపము చేసింది.

యోగి :—చిన్నపిల్ల కదూ నాయనా! సంఘములో విచ్చల విడిగా సంచరించే పాపాన్ని తెలియక స్వీకరించింది. దాన్ని కప్పిపుచ్చే శబ్ద జాలాన్ని బహుశా నేకరించి ఉండదు.

కావు :—బాబూ! పైకి చిన్నపిల్లే కాని, అనేక దీపా లార్పిన నెరజాణ.

సరో :—స్వామీ! నేను నిర్దోషురాలను అనుమానించి అపనిందలపాల్జేసి నా నెత్తురు కళ్ళజూచారు.

యోగి :—భయము లేదమ్మా! నీ నిష్కల్మష హృదయాన్ని లోకానికి వెలువరించే యోగ్యతాపత్రమే యీ మచ్చ.

కాపు :—స్వామీ! తమతో హేతువాదాలు చేయటానికి రాలేదు. ఆ నీచురాలను అవతలకు— — —

యోగి :—నాయనా! అమ్మవారి నాశ్రయించిన వెనుక మాకు పాపపుణ్యాలతో సంబంధము లేదు. ఆమెను సర్వధా రక్షించవలసిన బాధ్యత మాది.

శాస్త్రి :—అవి లోకాన్ని వంచించే మాటలు—సంఘము పాపులను శిక్షించి తీరుతుంది.

యోగి :—సంఘానికి శిక్షించటానికి అధికారము లేదు. అమ్మవర్గములో జేరినవారిని అమ్మ ఆజ్ఞలో పెట్టుకోగలదు.

ఆచారి :—అమ్మ లేదు, అయ్య లేదు. తమరు తప్పుకోవాలి.

సరో :—ఈ రాక్షసులు నన్ను చంపేస్తారు. రక్షించండి బాబూ!

యోగి :—భయము లేదమ్మా! ఈ యోగి శరీరములో ప్రాణమున్నంతవరకు భయము లేదు.

కాపు :—ఈ ముసలి ప్రాణము తీయుటములో కష్టము లేదు.

ఆచారి :—కాని, స్వాములని జంకుతున్నాము.

శాస్త్రి :—స్వామీ! దారము తెగిందాకా లాగితే లాభము లేదు. ఎందుకు మీరు శ్రమపడుతారు? మీ దారి మీరు చూచుకోండి. ఒక నీచురాలి కొఱకు మీ ప్రాణాలెందుకు పోగొట్టుకొంటారు?

యోగి :—(నవ్వి) నిజము చెప్పావు నాయనా! (ఆలోచించి) పాపాత్ములు పాపాత్ములను శిక్షించటము న్యాయము కాదు. కనుక, పాపములేనివాళ్ళు కఱ్ఱ నెత్తండి.

సరో :—నేను పాపాత్మురాలను కాను స్వామీ! శక్తి ఉంటే అమ్మను అడగండి.

షావు :—పాపము నంగనాచి. బొంకనేరిస్తే కాని, రంకు సాగదట!

సరో :—సెట్టీ! నీకుకూడ పిల్లలున్నారు, వెనుక ముందు లాలోచించుకో!

కాపు :—నోరుముయ్యి. సాధువు లున్నారని మరీ ధర్మపన్నాలు చెప్పుతున్నావు.

యోగి :—శాస్త్రీజీ! ఈ గుంపులో పాపములేనివారు మీరొక్కరే అని నాకు తోస్తోంది. ఎత్తండి కఱ్ఱ.

శాస్త్రి :—కాపూ! కఱ్ఱ యిల్లాగ యియ్యి. ఇల్లాంటి విధవపని యెవ్వరు చేయకుండా ఉొక్క చింపుతాను.

యోగి :—కాని, శాస్త్రీజీ! అవివాహిత, బ్రాహ్మణస్త్రీ, అని రెండవసారి విధవయైన పంచమస్త్రీని పెళ్లిచేసి లంచము కొట్టిన అయిదువేలింకా అరగలేదేమో ఆలోచించుకో! దేవి యెదుటి మాట.

శాస్త్రి :—ఇష్టము వచ్చినట్లు కూస్తే గడ్డముపట్టుకొని ఊగగలను జాగ్రత్త!

కాపు :—శాస్త్రీ! ఎందుకైనా మంచిది, ఆ కఱ్ఱ ఆచార్యుల వారికియ్యి.

యోగి :—ఆచార్యులవారు శిక్షించటాని కర్హులే. విద్యార్థ్యవస్థలో వితంతు వివాహము చేసుకొంటానని సంస్కారము సాగించి మాతృత్వము రాకుండా మందు లిప్పించారు కనుక.

శాస్త్రి :— (సంతోషముతో) చచ్చాడు ఆచారి. కాపు చెప్పగానే కట్ట లాగాడు. కాపూ! ఆ కొంచెము పని నీవే చెయ్యి.

యోగి :—కాపూ! తొందరపడకు. అమ్మవారి పేరు చెప్పి వసూలుచేసిన చందాలింకా అరగలేదు. దొంగలెక్కల కింకా దొరగారు సంతకంపెట్టలేదు.

షావు :—బాబూ! చచ్చుల్లిపాయి అమ్ముకొనే నా కెందుకీ గొడవ? ఏ కట్టను నిప్పంటే ఆ కట్టే కాలుతుంది.

కాపు :—(పట్టుకొని) దొంగముండా కొడుకా! నీ గుట్టు బయట పడుతుందేమో యని పప్పు జారినట్టు జారుతున్నావా? యెత్తు కట్ట.

యోగి :—ఈ షావుకారు నెందుకు బలవంతము చేస్తారు? బంగారునగలు చేయిస్తానని చెల్లెలుదగ్గర కొట్టివేసిన డబ్బింకా ఇనుపపెట్టెలో మూల్గుతోంది.

కాపు :—స్వామీ! తమరు సామాన్యులు కారు. మా తప్పులు క్షమించండి!

యోగి :—నాయనా! క్షమించేది జగజ్జనని ఆమెపాదాల నాశ్రయించి జీవించండి!

సరో :—ప్రభూ! నా కళంకము తొలగించే మార్గము చెప్పరా!

యోగి :—కవీంద్రుడు కమ్మని కవిత్వానికి పొంగి తెచ్చి పెట్టుకొన్న కళంకాన్ని తొలగించటము సాధ్యమౌతుందా!

శాస్త్రి :—అయితే మేము పడింది పొరపాటే అంటారా?

యోగి :—స్త్రీ పురుషులు చనువుగా మాట్లాడితే పాపమని నమ్మే సంఘము పొరబడుతుందా?

ఆచా :—ఈ దొంగముండాకొడుకు ఎన్నో నిదర్శనా లున్నాయని నమ్మించి గాడిదలను చేస్తాడా!

శాస్త్రి :—నేను చేసే దేమిటి? భగవంతుడే చేశాడు.

పాపు :—ఈ శాస్త్రుల్లు ఎన్నిసార్లు మోసగించినా మళ్ళీ నమ్మటము వలన మనమే గాడిదల మైనాము.

కాపు :—(శాస్త్రి చెవి పట్టుకొని) శాస్త్రీ! పదు, స్వామీజీ కాళ్ళమీద, అమాయకురాలను అల్లరిచేసిన పాపానికి పశ్చాత్తాపము చెందుతూ! చూస్తావే ఆచారి! పంగనామాలు చెరిగి పోతాయని భయమా?

పాపు :—నా కల్లాంటి చిక్కేమి లేదు. ఎన్నిసార్లు పడమన్నా పడతాను. పెద్దపొట్టను ఎల్లాగో సర్దుకొంటాను. కాని, గుంజీలు మాత్రము తీయించకండే.

ఆచా :—అవి తప్పవు. పాపాత్ములను పాతాళలోకము లోంచి పైకి లాగే మార్గమదే.

యోగి :—అవసరములేదు నాయనా! పశ్చాత్తాపానికి ఫలితము మళ్ళీ పాపము చేయకపోవటమే.

( అందరు నమస్కరించి వెడలిపోవుదురు. )

యోగి :—అమ్మా సెలవా!

సరో :—నా గతి ?

యోగి :—నీ తలి దండ్రు లే.

సరో :—ఈ చురకతో వికృతాకారమొందిన నేను తల్లి దండ్రుల మొగము చూడలేను. బంధువుల అన్యాయ దేశాన్ని వినలేను. వంశాని కపఖ్యాతి తెచ్చానసే నిందను సహించ లేను.

యోగి :—అయితే ఇప్పుడు నేను చేయవలసినపని యేమిటి?

సరో :—తల్లయినా, తండ్రయినా మీరే. నీళ్ళ ముంచినా పాల ముంచినా, భారము మీదే.

యోగి :—నేను సన్యాసిని. ఈ మాయాప్రపంచాన్ని దాటి శ్రీపరమేశ్వరీ చరణాల విందాల న్నాశ్రయించే నాకు నీవు భారమమ్మా!

సరో :—కాని, తప్పదు.

యోగి :—తల్లి యాజ్ఞ!

( సరోజినితో వెడలును. )

## గేయం

సేవా! సేవా! మానవసేవ!
సంఘము గర్జన సలిపిన గాని
దుర్మార్గంబులు మీరినగాని
యువజనులకు హితవే కాదా
ముస్లిం హిందూ హరిజనులైనా
సమస్త మానవు లొకటే
సేవా! సేవా! మానవసేవ!
నరాధమా!
నరాధమా!
నరాధమా నీ స్వార్థము మానర
మానవ సౌఖ్యమె మతమను కోరా!
మానవ సేవా మాధవ సేవ
పవిత్ర ధర్మం బదిరోయిరా!
సేవా! సేవా! మానవసేవ!

# వైవధ్య శ్యపం

( చరణదాసు ప్రవేశించును )

[illegible] ఇవ్వాలి. తాళము తప్పుతోంది. నృత్యమంటే మాటలా! పూర్వము భరతమహర్షి కనిపెట్టిన శాస్త్రము. శిక్షణ లేనివిధముగా గంతులు వేయుటయే నాట్యము కాదు. రాగము, తాళము, సాహిత్యము లేనిదే నాట్యము కాదు. పూర్వము శుద్ధాంతఃపురములో ఉండే రాజకన్యకలు నేర్చుకొనేవారు. సెబాస్! ఇంక కొంచెము వంగాలి, భ్రుకుటి బంధించాలి. ఆ చూపులో జాలి, అనానుకత్వము ద్యోతకమవాలి. నా మానము రక్షింపుమని భావము. కొంచెము మెడ వంచితే ఆ భావము పూర్తిగా ద్యోతకమవుతుంది. ఛా! శ్రీకృష్ణుడు మురళి వాయిస్తున్నట్లు ప్రదర్శించాలి: కటాక్ష వీక్షణాలు మురళిమీద పడి ప్రాకాలి. ఇందీవర దళశ్యాముడు శ్రీకృష్ణుడు. త్రిభంగే అంటే అర్థము కాలేదు. మంచి పోజ్ ఇచ్చావు. మురారి ముఖాన చక్రముతో చంపాడు. గంతు వెయ్యి. నచ్చలేదు, మళ్ళా ప్రారంభించు, వలలో చిక్కుకుంది మానస్సు పక్షి. ఆహారము వెదుకుతున్న పక్షి చిన్న చిన్న గంతులు వేస్తూ ఎగురుతుంది. మళ్ళీ ప్రారంభించు. చెప్పలేక చచ్చిపోతున్నాను. ఒకసారి చెప్తే గ్రహించలేకపోతే నాకు చాల కోపము.

( యోగి సరోజిని వచ్చి ప్రవేశించెదరు )

యోగి :—స్వామీ!

చరణ :—ఎవరు ?

యోగి :—స్వామీ !

చరణ :—రజనీ ! అక్కడ నిలబడ్డావేరా ! నృత్యము మాని ఆ బిచ్చగానిదగ్గఱ నిలబడ్డావే ?

సరో :—( మాట్లాడదు )

చరణ :—(దగ్గఱకు వచ్చి) రజనీ ! తిట్టనులే. ఏకో కని పెంచిన తండ్రిని కనుక ప్రపంచములో నిన్ను మించిన వాళ్ళుం డ కూడదనే ఆశతో చీవాట్లుపెట్టాను. కాని, నీమీాద నాకు కోపమా ! ఇంకొకసారి Practice చేయి. నీకు మంచి మామిడి పళ్ళు తెచ్చి పెట్టాను.

సరో :—నా పేరు సరోజినండి.

చరణ :—నాకు కోపము వస్తోంది. బ్రతిమాలినకొలది పెంకితనము పనికిరాదు. రా అమ్మా రా !

యోగి :—నాయనా ! ఈమె మీా రజని కాదు, మా సరోజిని.

చరణ :—మా రజని కాదా !

యోగి :—పది సంవత్సరాల క్రిందట చనిపోయిన రజని ఇప్పు డెల్లాగ వస్తుంది ?

చరణ :—స్వామీ ! మా రజని చనిపోయిందా ! ( ఆలోచించి ) అవును, చనిపోయింది కాని —

యోగి :—దాసూ! నీ ఊహా బలములో ఆమె జీవించి ఉందని, ఆమె నాట్యము చేస్తోందని నమ్మి నీవు నాటకమాడు తున్నావు.

చరణ :—(నిట్టూర్పు వదలి) ఎంత గారాబముగా పది సంవత్సరాలు పెంచితే ఏమిలాభము? మోసముచేసి నేను ఊళ్ళో లేనప్పుడు పిట్టలాగ ఎగిరిపోయింది. ఎంతమందిని ఇల్లాగ మోసగించిందో!

సరో :—మీ అమ్మాయి చనిపోయిందా!

చరణ :—స్వామీ! మీరు మోసము చేయడములేదు కదా! ఈ పిల్ల మా రజని కాదా! రజనీ! (ఆలోచించి) ఉండండి, ఇప్పుడే వస్తాను (అని లోపలకు పోవును)

యోగి :—(నిట్టూర్పు వదలి) తల్లీ! సంసార సాగరములో మనుష్యులను ఎల్లాగ ఈదిస్తున్నావో! నీ లీలలు అనంతాలు. పదిసంవత్సరాల క్రిందట చనిపోయిన రజనిని తన ఊహాబల ముతో జీవింపజేసి, ఆమెకు నృత్యము నేర్పుతున్నానని ఆనం దించే బ్రాహ్మణుని స్వప్నాన్ని, మాచేత భంగము చేయించావు తల్లీ!

చరణ :—(పటముతో ప్రవేశించి) కాషాయిగుడ్డలు కట్టి గడ్డాలు, మీసాలు పెంచిన మీరుకూడా అబద్ధమాడు తున్నారా! చూడండి, ఈ ఫోటోకు ఈమెకు భేదముందా! తండ్రికి పిల్లకు ఎడబాటుచేయుటము మీవంటి సాధుపుంగవు లకు చెల్లుతుందా!

(సరోజిని, యోగి పటమును జూచి ఆశ్చర్యమొందెదరు)

చరణ :—రజనీ! కోపపడనులే. పిల్లతప్పు తండ్రి క్షమించకపోతే ఇంకెవరు క్షమిస్తారు?

సరో :—క్షమించాలి. నా పేరు సరోజిని. తమవద్ద విద్య నేర్చుకోటానికి వచ్చాను.

చరణ :— (తదేకదృష్టితో) నీవు మా రజనివి కావా! (పటము చేతిలోనుండి జారును) రజనివి కావా! (కన్నీరు కార్చును)

యోగి :—దాసూ!

చరణ :—స్వామీ! నా యేకైకపుత్రిక—పదిసంవత్సరాలు నిండకముందే పండిత సభలలో ప్రశంసపొందే అంత నాట్యవిద్యను నేర్చుకొంది. ఆమె సంపాదించిన కప్పులు, మెడల్సు చూస్తుంటే నా కన్నులు చెల్లులు పడుతున్నాయి.

యోగి :—దాసూ! తల్లి నీ దుఃఖాన్ని చూచి జాలిపడి ఈ అమ్మాయిని పంపించింది. స్వీకరించి విద్యను నేర్పు. కావలసివస్తే రజని అని పేరు మార్చు.

సరో :—నేనే మీ రజనిని అని అనుకోండి.

చరణ :—అమ్మా! ఎప్పుడైనా పెంపుడు కూతురు కన్న కూతురవుతుందా!

యోగి :—మీ రజని బ్రతికిఉంటే ఈ విధంగానే ఉండేది కదా!

చరణ :—స్వామీ! నిజమే, మా రజని యీమె యని బాహ్యప్రకృతి నిరూపించింది. కాని, హృదయాలు మాత్రము అంతసులభంగా అతుకుకోవని నా భయము.

యోగి :—విద్య నేర్పావనే కృతజ్ఞత హృదయాలను దృఢముగా బ ధిస్తుంది.

చరణ :—స్వామీ! మీరు పొరబడుతున్నారు. ఈ ప్రపంచము లో లేనిది, కావలసింది కృతజ్ఞత ఒకటే.

యోగి :—ప్రయత్నము చెయ్యి, సాధ్యము కాకపోతే పరిత్యజించు.

చరణ :—స్వామీ! నిరంతర సహచర్యము వలన హృదయములో ఒకరూపము గాఢముగా నాటినపుడు దాన్ని సులభముగా పరిత్యజింపలేము. మనము పరిత్యజించినా అది మనలను వదలదు. వెంటాడుతూనే ఉంటుంది. పరాయి పిల్లలను తెచ్చి పెంచటము మమకారముతో బాధపడటము తద్దినము కొని తెచ్చుకోవటమే. వినలేదా నాయనా! జడభరతుని గాథ!

యోగి :—ఈమెకు వేరే దిక్కులేదు. ఇలాంటి వాళ్ళకు విద్య నేర్పితేనే పేరువస్తుంది.

చరణ :—స్వామీ! వెధవ పేరెవరికి కావాలి? నేను నిర్మించిన ఆశాసౌధాలన్నీ నేలమట్టమైనాయి. కోటిసూర్య ప్రభా భాసమయిన నా ఆనంద దీపాన్ని ఆర్పి మా రజని నన్ను మోసగించి వెళ్ళిపోయింది. గాఢాంధకారములో బడి గమ్యస్థానము తెలియక శూన్యహృదయములో బయలుదేరే దుఃఖనదుల స్వరూపాన్ని కాని, స్రోతస్సు కాని తెలియక పిచ్చెత్తి తిరుగుతున్నాను. చిక్కి, శల్యావశిష్టమైయున్న నా నాట్యశాస్త్రాన్ని

6

యెవరి చేతులలో పెట్టి ఈ శరీరాన్ని వదలాలో తెలియక విల పిస్తున్నాను. నా నాట్యశాస్త్రము కాక నాకీ ప్రపంచములో ప్రేమించే వస్తువేముంది స్వామీ !

సరో:—తండ్రీ! ఆ విద్యను సంపూర్ణముగా గ్రహించి పోషిస్తానని వాగ్దానము చేస్తాను.

చరణ:—ఆనందంతో వాగ్దానముచేస్తావా తల్లీ! మా రజని వలె హృదయపూర్వకముగా నాన్నా అని పిలు స్తావా! మళ్ళీ ఈ శూన్య గృహములో ఆనంద దీపికను వెలి గించి గజ్జెలుకట్టి కలకలలాడుతూ నాట్యమాడేటట్లు చేస్తావా తల్లీ !

సరో:—తండ్రీ! నా కట్టి శక్తి ఉంది.. చేయగలను.

చరణ:—మంచిది స్వామీ! మీ రజనిని మా కిస్తారా !

యోగి:—అభ్యంతర మేముంది. ఆమె మీ రజని (నవ్వుతూ) అయితే. మా సరోజిని మోసగించి పిట్టలాగ యెగిరి పోయిందన్నమాట.

చరణ:—స్వామీ ! ఆ భావము మాత్రము మీ హృద యములో ప్రవేశ పెట్టకండి. ఎంతటి వేదాంతినైనా హృద యము ద్రవకాలయ్యేటట్టు ఏడ్పించే పటుత్వము దాని కుంది. 'మా' అనే మమకారము ఎవ్వరిమీద పెట్టుకోకండి. మా సరోజిని అంటే నేలమట్ట మైనా రన్నమాటే !

యోగి :—( నవ్వుతూ ) సరోజినీ! కాదు కాదు, రజనీ! నేను చెప్పినమాట మరచి పోవద్దు.

చరణ :— ఏమిటది ?

సరో :—కృతజ్ఞత!

చరణ :—అవును. అది చాలా అవసరమైందే. ఎండి పోయి నేలగూలటానికి సిద్ధముగా ఉన్న చెట్లనుకూడా చిగురింపజేసే పటుత్వము ఆ కృతజ్ఞత కుంది.

యోగి :—అమ్మా! వెళ్ళి వస్తాను.

సరో :—అప్పు డప్పుడీ దీనురాలిని ఆశీర్వదించండి !

యోగి :—అమ్మా ! ప్రయత్నము చేస్తాను.

చరణ :—స్వామీ! మీరు మా యింట్లో దీపము వెలిగించారు. ఈ వేళ ఈ దీను డిచ్చిన భిక్షను స్వీకరించి వెళ్ళాలి.

యోగి : —నాయనా ! నీ హృదయానికి మెచ్చాను. వైరాగ్యములో ఉండి జీవనోపాధినికూడా పరిత్యజించి, చనిపోయిన దుహితనే నిరంతరము ధ్యానిస్తూ ఈ లోకములో జీవిస్తున్నా నీ తనయ సంచరించే లోకాల నన్వేషిస్తూ పరిభ్రమిస్తుండే నీహృదయాన్నినేను గుర్తించా ! నీ దయార్ద్రహృదయానికి దేవి మెచ్చి ఈమెను ప్రసాదించింది. వస్తా.

( చరణదాసు సరోజిని నమస్కరించెదరు. యోగి
ఆశీర్వదించును. )

## గేయం

మమ్ముబ్రోవ విదేలను తల్లీ !
మధురామృత సమకృప జల్లీ !
పావనచరితా మాతా !
నీ కరుణారతికే భిక్షుకులము గా
వేడిపాడితిమే——తల్లీ !
ఆశలుదీరా సమ్మోదమలరా
బ్రోవ రాగదవే——తల్లీ !
మముబ్రోవ విదేలను తల్లీ !
మధురామృత సమకృప జల్లీ !
నీ కృప మాకిడవేని
బ్రతుకే దుర్భరమౌను
మమ్ముబ్రోవను విదేలను తల్లీ
మధురామృత సమకృప జల్లీ !

# 4 వ దృశ్యము

(లోపల హార్మోనియము వాయించుచుందురు)

(శాంతరావు, వినాయకరావు ప్రవేశించెదరు)

శాంత :—అది పిచ్చిమాట. రూపాయల చప్పుడు వినబడితే కొండమీద కోతి దిగి వస్తుంది.

వినా :—నిజమే. కాని, చరణదాసు మాత్రము ఆ రకము మనుష్యుడు కాడు, రజని చనిపోయిన తర్వాత అతని ముఖములో నవ్వే లేదు. అతని నేత్రాలలోంచి ఆవేదన బయలుదేరి లోకాన్ని విలపింప జేస్తుంది. పిలిచినవాళ్ళది పుణ్యము. పెట్టిన అన్నము కూడా పూర్తిగా తింటాడనే నమ్మకము లేదు. ఏ సమయములో రజనీ అని యేడుస్తూ అన్నము వదలిపోతాడో ఎవరు చెప్పలేరు. ఆతణ్ణి వరించిన నాట్యశాస్త్రము—20 సంవత్సరములనుండి లాలించి పాలించిన నాట్యశాస్త్రము—ఎవరి పాలౌతుందా అని బెంగ పెట్టుకొన్నారు కళోపాసకులు.

శాంత :—అయితే ప్రలాభాలకు లొంగడంటావా!

వినా :—వయస్సు నలుబది సంవత్సరాలైనా శతవృద్ధుని కంటె యెక్కువ వేదాంతి. ధూళి దూసరిత వస్త్రాలలో ఆతడానందము పొందుతాడు. అతని మాటలలో ధైర్య స్థైర్య హిమాద్రులను కూడా కరగించి ఆవిరిచేసే పటుత్వముంది గాఢముగా ప్రేమించిన తండ్రినుండి కుమార్తెను [illegible]

టములో దేవతల మాహాత్మ్యముందని పరచు భక్తాగ్రగణ్యులు కూడా, ఆత్మార్పణముచేసిన యోగులుకూడ అంగీకరించే అంత శక్తి ఉంది ఆతని ఆవేదనలో.

శాంత :—అయితే -

వినా :—కాని, చూడవలసిన వ్యక్తి, మానవు ప్రేమ యెంత దూరము వెళ్ళుతుందో ప్రేమించిన వ్యక్తులు దూర మవటము వలన మానవు లెంత మారిపోతారో ప్రేమలో అమృతము, విషము ఎంత హృద్యముగా సమ్మిశ్రితమైనాయో తెలియటానికి చాలసాయము చేస్తాడు.

శాంత :—ఈపాటికి వస్తుండాలి.

వినా :—అక్కడే ఉంది సందేహము. పంపినవాడు తిరిగి వస్తాడా లేక, చరణదాసుతో వస్తాడా అని.

శాంత :—ఆయన రాకపోతే మనమే ఆతని దర్శనము చేద్దాము. నీవు చెప్పిందే నిజమైతే ఆతని కొక దేవాలయము నిర్మించినా మానవుల ఋణము తీరదు.

వినా :—అయినా—అదుగో, చరణదాసు వస్తున్నాడు.

నృత్యశాస్త్రంబు రూపొంది నిఖిల తలము
సంచరించునోయన దాసు సహజ మధుర
కంఠమున నాత్మ చలనంబు కలుగజేసి
వచ్చుచుండెను గానప్రవాహ మొప్ప.

శాంత :—ఎంత మధురమైన కంఠము! ఆ కంఠములో దుఃఖ జ్వాలలు కాన్పించటము లేదు.

వినా :—ఏమో!

( చరణదాసు ప్రవేశించును )

( శాంత, వినాయకులు నమస్కరించెదరు—చరణదాసు ఆశీర్వదించి, యుచితాసనమున గూర్చుండును )

శాంత :—మీకు శ్రమ యిచ్చాము క్షమించాలి !

చరణ :— తీవ్రాతప దందహ్యమాన హృదయుడై మేఘాన్ని వర్షింపజేయ ప్రార్థించాలని యత్నించే సమయములోనే అయాచితమై కుంభవృష్టిని గురిపించి లోకాన్ని సస్యశ్యామలం చేస్తానంది. అది భగవంతుని దయ.

వినా :—( ఆశ్చర్యముతో ) మీవంటి యోగి పుంగవులు—

చరణ :—మానవ ప్రేమలో గల మాధుర్యాన్ని హాలాహాలాన్ని అర్థము చేసికొని అనుభవించి కూడా ఆ ప్రేమకు లొంగకుండా ద్వంద్వాతీతులైనవారే యోగిపుంగవులు. కాని, మావంటి వారా !

శాంత :—ఆత్మశక్తులను అర్థము చేసి కొనలేకపోవటము లోనే మహాత్మ్యముంది—కాని, తమరు మా పాఠశాలకాచార్య పదవి నలంకరించాలి !

చరణ :—క్షమించాలి, పాఠశాలా సిద్ధాంతాలలో నాకు నమ్మకము లేదు. మీ పాఠశాలలో నియమిత కాలములో నియమిత విద్యార్థులకు నియమిత పంథాలలో విద్య నేర్పవలసిఉంటుంది. కళారాధకుడు ఆకాశ మార్గాన్ని సంచరించే పక్షి, పంజరములో పెట్టి, దాని స్వాతంత్ర్యాన్ని హరిస్తే విలపించి విలపించి కృశించి నశిస్తుంది. కాని, తన మధుర కంఠముతో లోకాన్ని ఆనందింప జెయ్యదు.

శాంత :—అయితే, తమరు వచ్చిన పని ?

చరణ :—గాఢాంధకారములో దారి కనిపించక దిక్కులేక విలపించే నాకు దేవి ఒకబాలికను ప్రసాదించింది. ఆమెకు విద్య నేర్పటాని కైదువేలు కావలసి వచ్చింది.

వినా :—అయితే తమ రెల్లాగ తీర్చుకొంటారు ?

చరణ :—సరస్వతి ప్రసాదిస్తే కనకవర్షము కురుస్తుంది.

శాంత—స్వామీ ! తమ కింత శ్రమ యెందుకు ? మీ సరస్వతీ విలాస భవనము గా నా గృహాన్ని స్వీకరించి, నన్ను కటాక్షించండి. మీ యిష్టము వచ్చినంత ధనము ఖర్చుపెట్టండి.

చరణ :—ఇతరుల కృపమీద ఆధారపడిన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొంటాడు. స్వాతంత్ర్యము లేనివాడు కళారాధకుడు కాజాలడు.

వినా :—మీ కళను సంతసింపజేసి, అర్పించిన కానుక స్వాతంత్ర్యాన్ని హరింపజాలదు.

చరణ :—నాకు సమ్మతమే కాని,

శాంత :—సందేహించకండి. మీరు మా ఆస్థానానికి తాన్‌సేను వంటివారు.

వినా :—(అపహసించి) అబ్బాయిని చూపిస్తే

శాంత :—శ్యామ్

చరణ :—(తనలో) పేరు అనుకూలముగానే ఉంది. ఆకారాన్ని చూస్తేకాని, అర్హత ఉందో లేదో తేల్చలేను.

(శ్యామ్ ప్రవేశించును)

చరణ :—(అర్ధస్వగతము) నేత్రాలలో జ్యోతి ఉంది. అతి సూక్ష్మతను హృదయ పరివర్తనాన్నికూడా వెలిబుచ్చు తను లత, విద్యుల్లతను మించే పదవిన్యాసము. లోకాన్ని ఆకర్షించే నాసిక పిట్టలలాగ ఎగిరిపోయే భ్రూకుటి, ఆనందములో ఉండే విభేదాలను హృద్యముగా వెలిబుచ్చే పెదవులు—బాహ్య లక్షణాలు సరిపోయాయి. (ప్రకాశముగా) అబ్బాయి! నీ పేరే మిటి ?

శ్యామ్ :—నా పేరు శ్యామ్ అంటారు.

చరణ :—ఏమైనా పాడగలవా!

శ్యామ్ :—(పాడును)

శాంత :—ఈమధ్య అభ్యాసములేక అప్రశుతులు పల్క వచ్చును. మీ వంటి సద్గురువులచేతులలో పడితే సంగీతశాస్త్ర ములో గట్టిప్రజ్ఞ లభిస్తుంది.

చరణ:—నాయనా! నృత్యశాస్త్రములో అభ్యాసముందా!

శ్యామ్ :—నేర్చుకోవాలని ఉంది కాని, తగిన గురువులు లభించటము లేదు.

చరణ :—శ్యామ్! నీవు జమీందారుబిడ్డ వని మరచి పోవాలి. అహంకారము కలవాళ్ళను సరస్వతి ప్రేమించదు. ఆమె కటాక్షము కావాలంటే నమ్రత కావాలి. గురుశుశ్రూ షలో అహంకారాన్ని సంపూర్ణముగా నాశనముచేసికో వాలి. అప్పుడే నృత్యశాస్త్రము లభ్యమవుతుంది.

శాంత :—మీ చేతులలో పెట్టాను. మీ యిష్టము వచ్చి నట్లు తయారు చెయ్యండి.

చరణ :—సెలవా !

వినా :—పునర్దర్శనభాగ్యము !

చరణ :—బంగారపు పంజరములో పక్షిని బంధించారు.

శాంత :— ఈ పక్షి పంజరములో బంధింపబడదు. మీరు నా ప్రార్థన నంగీకరించినందులకు ధన్యవాదాలు.

చరణ :—నమస్కారములు ( వెడలును )

శ్యామ్ :—నాయనా! ఈ పిచ్చివాడా నాకు నృత్యము నేర్పేది ?

వినా :—శ్యామ్! మహాత్ము లెప్పుడు బాహ్యావేషానికి లెక్కచేయరు. విలువగల వస్తువులను ఇనుపపెట్టెలో పెట్టినట్లు, సరస్వతి అద్భుతకళలను ఇటువంటి వ్యక్తులలో దాస్తుంది.

శ్యామ్ :— కాని, రత్నఖచితాంగుళీయకాన్ని సువర్ణపేటికలో రక్షిస్తే బాగుండదా !

శాంత :—అప్పుడు ఆ రెంటిని రక్షించవలసిన బాధ్యత ఇంకొకవస్తువుమీద పడుతుంది. రేపు ఆతణ్ణి చూచి నీ అభిప్రాయము తెల్పు.

శ్యామ్ :—ఒక రోజులోనే మనుష్యుడు మారుతాడా ?

శాంత :—ఒకరోజులో కాదు, ఒక నిముషములో—ఆశ ప్రవేశించినపుడు, ఆనందడోలికలలో మానవుడూగుతున్నప్పుడు విచిత్రకాంతి శరీరమంతా వ్యాపిస్తుంది.

వినా :—మన మీటింగుమాట మరచిపోయారు.

శాంత :—మరచిపోలేదు కాని, ఆనందాన్ని ఆపలేక పోతున్నాను. శ్యామ్! వెళ్ళి, వెనుకపాఠాలను అభ్యాసముచెయ్యి !

( తెర వ్రాలును )

# 5 వ దృశ్యము

( శ్యామ్ హార్మోనియము వాయించుచు, పాటపాడుచుండును )

గేయం

ఓసుదతీ! ఓసుదతీ!! యిదేలా! పలుకవా సుదతి!
ఆశలుదీరగ హాసము మీరగ! రావిదేల సుదతి
నాపై కినుకో! యిదేమొ తెలుపగదే!
ఓసుదతి! ఓసుదతి! యిదేలా! పలుకవా సుదతీ!
పూల పడవ నిండు వెన్నెల పోదాంపదవె
చాలు నీ యలుకు! సరసము లివిగావే!
ఓసుదతీ! ఓసుదతీ! యిదేలా పలుకవా సుదతీ!

రజని :—(ప్రవేశించి) రాళ్ళు కరగిపోతున్నాయి.

శ్యామ్ :—నీళ్ళమీద నాట్యముచేసే నేర్పు మీ రాధకుందికదూ!

రజని :—రాధ యెవరు?

శ్యామ్ :—నీకా గొడవ యెందుకు! రాధా మాధవులను గూర్చి అవివాహితలు మాట్లాడకూడదు.

రజని :—అంటే, అవివాహితులు మాట్లాడవచ్చు నన్న మాట.

శ్యామ్ :—మాటకు మాట అందిస్తున్నావు. నే నెవరినో తెలుసునా!

రజని :—రాధా పతి శ్యామ్‌సుందరుడని ప్రజలనుకొంటు న్నారు.

శ్యామ్ :—(ఆశను సూచించే నేత్రాలతో) ప్రజల మాటలలో నిజముండంటావా!

రజని :—(నిర్లక్ష్యముతో) లోకులు కాకులు.

శ్యామ్ :—కాని,

రజని :—కానేమిటి ; నేను పండిత పుత్రికను. ఆ సంగతి జ్ఞాపకముంచుకో.

శ్యామ్ :—పండిత పుత్రులు, పుత్రికలు ఒకే రకములో చేరరుకదా!

రజని :—కాని, కందా రాయుళ్ళలో మాత్రము చేరరు.

శ్యామ్ :—మా సొమ్ము తింటూ, మాకే యెసళ్ళు పెట్టు తున్నావు. ఇంతకంటె కృతఘ్నత ఉంటుందా!

రజని :—మా తండ్రివద్ద విద్య నేర్చుకొంటూ, ఇంత నిర్లక్ష్యముగా మాట్లాడటం కృతఘ్నత కాదా! నేను కనుక సహించాను ; మా రాధ అయితేనా!

శ్యామ్ :—మీ రాధ యెవరు?

రజని :—నాకేమి తెలుసును. ప్రశ స్తచిత్రకారుల సృష్టిలో ఉద్భవించి, నీ పూజామందిరములో విరాజిల్లే చిత్రాన్ని అడుగు తెలుస్తుంది. తల్లిదండ్రులు పెట్టిన పేరు మార్చి, రాధ అని పిలవటాని కెంతధైర్యమో!

శ్యామ్ :—మాధవునిమీద గీతము కట్టి, తండ్రిగారి కళ్ళలో కారము కొట్టి, నృత్యము నేర్చుకోవటాని కెంతధైర్య ముండాలి. అందుకనే స్త్రీ సాహస మన్నారు.

రజని :—ఎవరు కట్టారు !

శ్యామ్ :—మా రాధ.

రజని :—మా మాధవునిమీద గీతము కట్టటానికి మీ రాధ కేమి అధికారముంది ? ఆ అధికార మెవరిచ్చారు ?

శ్యామ్ :—పుష్పనారాచుడు.

రజని :—శ్యామ్ ! మనము మంచి వాళ్ళముకదా ! మన కటువంటి గొడవలు లేవు.

శ్యామ్ :—ప్రజలా మాటలను నమ్మరు. నేను రజనిని ప్రేమించటములేదని ఎంతచెప్పినా నమ్మరు. పెళ్ళి యెప్పుడని యేడిపిస్తున్నారు.

రజని :—నిజముగా ప్రజలకు బుద్ధిలేదు. మంచిఘాస్స కొట్టావు. జమీందారు కోడల వంటున్నారు చుట్టుప్రక్కల నున్న ముసలమ్మలు. కాని, నీవంటి పెంకి తలకాయ లను పెండ్లాడ దలచుకోలేదు.

శ్యామ్ :—పెండ్లాడమని నీ కాళ్ళమీద పడితే వద్దని గెంటివేసేటట్లు మాట్లాడుతున్నావు. స్త్రీ పురుష విభేదాలను విస్మరించి గజ్జెకట్టి గంతులువేసే నీవంటి యువతులను జమీందారులు పెండ్లిచేసికొనరు.

రజని :—పెండ్లాడకపోతే యెల్లాగ బ్రతకటము ! గుండె బ్రద్దలై చచ్చిపోతే !

శ్యామ్ :—అపుడు వైద్యులను పిలిపించి, గుండె అతికించి బ్రతికిస్తానులే.

రజని :—ఆ పని యిప్పుడే చేయరాదూ !

శ్యామ్ :—ఆశకు అంతు లేదు.

రజని :—హద్దుమీరి మాట్లాడుతున్నావు.

శ్యామ్ :—ఇతరులు లోనికి రాకూడదనే బోర్డు చూచి కూడ లోపలకు రావటము హద్దుమీరి నడవటము కదా !

రజని :—ఆ బోర్డు నీవు గోడకు తగిలించావు. నేను గుమ్మము లోంచి వచ్చాను.

శ్యామ్ :—బ్రహ్మదేవుడు ప్రత్యేకముగా సృష్టించిన వ్యక్తివి.

రజని :—నేనూ అదే అనుకొంటున్నాను. భారతితో పోట్లాడి నిన్ను సృష్టించి ఉంటాడు అని. ఆమెతో సరస సల్లాపాలాడుతూ నన్ను సృష్టించి ఉంటాడు.

శ్యామ్ :—అంటే ?

రజని :—అంటే, అర్థముకాని జమీందారులుంటే రెండు చేతుల తినవలసిందే.

శ్యామ్ :—గజ్జెకట్టటం చేతకాని నీవంటి నర్తకులు నాట్యము చేస్తే సహస్రాక్షులు, ఆదిశేషువులు కావాలి.

రజని :—అహల్య దొరికితే సహస్రాక్షత్వము, అధికార గర్వ మబ్బితే సహస్రఫణిత్వము సులభముగా లభ్యమవు తాయి. మీవంటి జమీందారుల కట్టి శ్రమపడవలసిన అవసరము లేదు.

శ్యామ్ :—కబుర్లతో కాలక్షేపము చేయక గజ్జెకట్టు

రజని :—నీవు గజ్జె కట్టు నేను, వాయిస్తాను.

శ్యామ్ :—ఇంక చెప్పనక్కరలేదు. మూతులో కాలు వచ్చి ముద్దెట్టుకొంటాయి.

రజని :—ఆ దృశ్యము చూస్తే గుండెలు బ్రద్దలవవూ!

శ్యామ్ :—ఎందుకు?

రజని :—అసూయ!

శ్యామ్ :—చేతకాదను, నేను గజ్జె కట్టాను.

రజని :—జోహారు చేయుటానికి నేను పురుషుణ్ణి కాను (అని గజ్జెకట్టును. శ్యామ్ హార్మోనియము వాయించును)

గే యం

పడతులు బానిసలన్నావా
భామలు దాసీలన్నావా!
తగదోయి యువకుడా
ధర్మహీనవు తలవు
దేశ సౌభాగ్యంబు
ఘూహింపవోయి!
పడతులు బానిసలన్నావా
భామలు దాసీలన్నావా!
యినుప చెప్పుల క్రింద
అబలల నణచగా
దేశాన నీకెంత
శాంతియున్నదిరా!
పడతులు బానిసలన్నావా
భామలు దాసీలన్నావా!

( ఇంతలో శాంతరావు చరణదాసు ప్రవేశించెదరు )

(రజని తండ్రిని చూచి సిగ్గుపడును.)

శ్యామ్ :—( వారిని చూడకయే ) ఓడిపోయావా !

చరణ :—పందాలలోకి దిగారా !

( శ్యామ్ సిగ్గుపడి దూరముగా నిలువబడును )

( రజని గజ్జెలు విప్పబోవును )

శాంత :—సరోజినీ ! ఆ పందె మేమిటో తెల్పండి.

చరణ :—రజనీ ! గజ్జెలు విప్పకు. శ్యామ్ గజ్జెలు కట్టు. మీ నాన్నగారే మధ్యవర్తులై తారతమ్యము తేలుస్తారు.

శ్యామ్ :—క్షమించాలి.

చరణ :—చిన్నపిల్లల ఆటలలో క్షమించవలసిన తప్పు లుండవు. తల్లిదండ్రు లిద్దరు తనయుల విద్యాభివృద్ధిని చూచి ఆనందించే అవకాశాన్ని యెందుకు పాడుచేస్తావు ?

శాంత :—అమ్మా ! సిగ్గుపడకు. (అని కుర్చీమీద కూర్చొనును )

చరణ :—ప్రారంభించండి. అంతర్ధాన మాగకముందు ప్రారంభిస్తే మంచిది.

( ఇరువురు నాట్యము చేయుదురు )

శాంత :—కర్ణార్జునులు, అభిమానములేని ద్రోణుడు. రజనికి నేను సువర్ణపతక మిస్తున్నాను. గురువుగారు శిష్యుణ్ణి ఆశీర్వదిస్తారు.

చరణ :—సువర్ణ పతకము కాదు. మా రజనికి మాధవు డంటే ప్రాణము. ఆ విగ్రహ మిస్తే బాగుంటుంది.

శాంత :—సరే, శ్యాముకు రాధా విగ్రహము, రజనికి మాధవ విగ్రహ మిద్దాము.

చరణ :—( నవ్వుతూ ) అప్పుడు రాధామాధవులకు దేవాలయము కట్టటమే మిగులుతుంది.

శాంత :—నాకు కొంచెము పనివుంది, గురూజీ వస్తారా!

చరణ :—సరే. ( అని వెడలుదురు )

రజని :—( నవ్వుతూ ) రాధామాధవులకు దేవాలయము కట్టారట!

శ్యామ్ :—ఆడవాళ్ళు అంత నవ్వకూడదు.

రజని :—మగవాళ్ళు వినకూడదు, జోక్యము కలుగచేసికోకూడదు.

శ్యామ్ :—నీ మాటలు వింటుంటే నాకు కోపము వస్తుంది.

రజని :—నీ కోపము చూస్తే నాకు నవ్వు వస్తుంది. కాని, శ్యామ్! రాధామాధవులకు దేవాలయము కట్టే మన దేవాలయము ఎప్పుడు కట్టారు ?

శ్యామ్ :—పెళ్ళినాడు ( అని నవ్వును )

రజని :—పెళ్ళి కాకుండానే మనమే కట్టుకొంటే

( తెర వ్రాలును )

## 6 వ దృశ్యము

( గ్రీసురూములో రంగులు పూసికొనుచు ప్రవేశించెదరు )

శ్యామ్ :—రాధా! మీ తండ్రి ఇష్టము లేకుండా యెందుకు మాట యిచ్చావు ?

రజని :—మా నాన్న ఇల్లాంటి చౌకరకము పేరుకు సమ్మతించడు. నేర్చిన నృత్యాన్ని భగవదర్పితము చేయాలంటాడు. పామరుల మెప్పుకు బాధపడి నృత్యశాస్త్రాన్ని అవమానించి ఖూనీచేయక పండితుల మెప్పుకు బాధపడి పెంపొందించమంటాడు.

శ్యామ్ :—కాని, ఈ సంగతి మీ నాన్నగారికి తెలిస్తే వారికి కోపము వస్తుందేమో అని జంకుతున్నాను.

రజని :—క్షమించటమే కాని, కోపపడటము ఆయన స్వభావము కాదు, ప్రపంచములో నేను ఒకని కోపానికే జంకుతాను

శ్యామ్ :—ఎవరి కోపానికి ?

రజని :—మా రాధామాధవుని కోపానికి. ఆతని పాదాల కడ నా ప్రేమ కుసుమాన్ని అర్పించాను.

శ్యామ్ :—మీ తండ్రిని మోసగించటము కృతఘ్నత కాదా !

రజని :—అభివృద్ధిలోనికి వచ్చే యువతీ యువకలోకాన్ని బాధించి, తమ ఆశయాలకొఱకు వాళ్ళను ఖూనీచేయటము రాక్షసత్వము కాదా !

శ్యామ్ :—యౌవన దర్పముచేత వెనుక ముందు లాలోచించటము లేదు. ఊళ్ళో పని. తెలియక పోవటము. నేను సంగీతము వెనుక లేడిలాగ నీ వెంట పడ్డాను.

రజని :—సెట్టితో గట్టిగా చెప్పాను. లోపలకు మా నాన్నను రానీయకుండా కట్టుదిట్టము చేసాను.

శ్యామ్ :—మా నాన్నకుకూడా పంపవద్దని చెప్పావా!

రజని :—లేదు.

శ్యామ్ :—అందుకనే స్త్రీలది కప్పతలకాయి అన్నారు.

రజని :—(కోపముతో) కారణము?

శ్యామ్ :—మా నాన్నకు పంపుతే మీ నాన్నతో చెప్పడా! వాళ్ళిద్దరు వస్తే అడ్డుపెట్టటము ఎవరి తరము?

రజని :—అయితే, మన ప్రయత్నము వ్యర్థమన్నమాట.

శ్యామ్ :—నిస్సందేహముగా.

రజని :—అయితే, ఇప్పుడు నన్నేమి చేయమంటావు?

శ్యామ్ :—నన్నేమి చేయమంటావు?

రజని :—ఏదో ఆలోచన చెప్పమంటాను.

శ్యామ్ :—అది నా శక్తి కతీతమంటాను.

రజని :—శ్యామ్! హాస్యానికికూడా హద్దుఉంది. ఆపదలో పడి ఉడుకెత్తిన హృదయానికి నీ హాస్యము కాలకూట విషము వంటిది.

శ్యామ్ :—నిజమే కాని, నా కేమిచెయ్యాలో తెలియదు.

రజని :—శ్యామ్! నే నపఖ్యాతి పాలవటము నీ కిష్టమా! నీవుతప్ప నాకు దిక్కెవ్వరు?

శ్యామ్ :—మీ తండ్రి లేరా!

రజని :—పిచ్చి సిద్ధాంతాలకు లొంగి, నా కీర్తి కడ్డువచ్చే తండ్రి నాకు శత్రువుకాని, మిత్రుడు కాడు.

శ్యామ్ :—చాలాదూరము వెళ్ళావు. పేరుకోసము ప్రాకులాడి కన్న తండ్రికంటె ఎక్కువగా ప్రేమించిన తండ్రిని చెడనాడు కొంటున్నావు. దూర మాలోచించుకో!

రజని :—చిన్నకొమ్మ దొరికింది, భయ్యాలేదు.

శ్యామ్ :—ఆ చిన్నకొమ్మ యేమిటి?

(రజని శ్యామును చూపించును)

శ్యామ్ :—(ఆనందపరవశుడై) రాధా! మా నాన్నకు పంపిన టికెట్టు నేను దాచాను.

రజని :—మధ్యదారిలో కనబడి రమ్మంటే.

శ్యామ్ :—అలాగ రారు.

రజని :—ఆపదనుండి రక్షించావు, ధన్యవాదాలు!

శ్యామ్ :—ఈశుష్క ధన్యవాదాలతో లాభ మేమిటి?

రజని :—అర్థమైంది. అవన్నీ లెక్కవేసుకో! అసలీఫాయిదాలతో అప్పుడు ముట్టచెప్తాను.

శ్యామ్ :—ఉట్టి చూపి డబ్బు లాగే రకము.

రజని :—లేకపోతే ఈ జమీందారీ ఎల్లాగ వస్తాయి ?

శ్యామ్ :—ఈ వెంకితన మిందాక యేమైందో ?

రజని : —సముద్రానికి పాటుపోటు లుంటాయి.

శ్యామ్:—రాధాప్రేమలోకూడా పాటు పోటు లుంటాయా?

రజని :—సిల్లీ ఫెలో ! అని కొట్టబోవును

( ఇంతలో సెట్టి ప్రవేశించును )

శ్యామ్ :—సేఠ్ జీ ! యేర్పాటులన్నీ పూర్తియైనాయా !

సేఠ్ :—లోటేమిటి, బాబూ ! గేటువద్ద విచ్చుకత్తులవంటి వాళ్ళున్నారు.

శ్యామ్ :—విగ్రహాలు తయారు చేయించావా !

సేఠ్ :—సిద్ధముగానే ఉన్నాయి. తెర యెత్తించ మంటావా!

శ్యామ్ :—రాధా ! నీవు నిజముగా రాధవే.

రజని :—నీవో మాధవుని అపరావతారానివే.

# 7 వ దృశ్యము

( లోపల నృత్యము జరుగుచుండును. గజ్జెలచప్పుడు వినబడును )

( వెలుపల రాము డను రౌడీ చరణదాసు నటకాయించును )

రాము :—దాసుగారూ క్షమించాలి! టికెట్టు లేందే పంపించ కూడదు.

చరణ :—మీ యజమానితో చెప్పు దాసు వచ్చా డని.

రాము :—క్షమించాలి ; గుమ్మము వదలి లోపలకు వెళ్తే చంపేస్తారు.

చరణ :—మీ యజమాని యెవరు ?

రాము :—ఆ విషయము చెప్తే మా ప్రాణాలు మావి కావు.

చరణ :—కారణము ?

రాము :—కాంప్లిమెంటరీ టికెట్ల బాధ పడలేక.

చరణ :—టికెట్టు కొంటాను.

రాము :—అమ్మరు.

చరణ :—నృత్యము చేసేవా ళ్ళెవరు ?

రాము :—ఆడవాళ్లు

చరణ :—ఆ సంగతి తెలుసును. కాని, పేరెవరు ?

రాము :—ఆ సంగతి నాకు తెలియదు.

చరణ :—( వచ్చే కోపాన్ని ఆపుకొని ) జమీందారు వచ్చారా ?

రాము :—జ్ఞాపకము లేదు. బహుశా వచ్చి ఉండరు.

చరణ :—ఎప్పుడు వస్తారు ?

రాము :—నాకు తెలియదు.

చరణ :—(కోపముతో) నీకేమి తెలుసును ?

రాము :—నాట్యము జరుగుతోందని—మీరు వచ్చారని—నే నడ్డుపెట్టానని—

చరణ :—వెంతెనముగా మాట్లాడితే నాకు కోపము వస్తుందని తెలుసునా ?

రాము :—తెలుసును.

చరణ :—ఎవరితో ఎల్లాగ మాట్లాడాలో తెలియదా ?

రాము :—తెలియదు.

చరణ :—నే నెవరినో తెలుసునా !

రాము :—తెలియదు.

చరణ :—( హెచ్చుకంఠముతో ) పశువా !

రాము :—పశు వని తెలియదు. పశువులు డ్యాన్సుకు రారని తెలుసును.

( చరణదాసు బెత్తముతో కొట్టబోవును. రాము ఎదుర్కొనును )

( ఇంతలో షావుకారు వచ్చి ఆపును )

చరణ :—సేఠ్ జీ !

షావు :—ఏమి సెలవు ?

రాము :—మీరెవరిని టికెట్టులేనిదే లోపలకు వెళ్ళనీయ వద్దని చెప్పారుకదా ! ఈయన గొప్ప యాయన కుంటుంది. రాడీలతో వ్యాపారము ఇంకా అర్థముకాలేదు.

పాపు :—( కన్నుగీటి ) నీ బుద్ధి నాపెత్తన మేమిటి ; పైవా ళ్ళెల్లాగ చెప్తే మన మల్లాగ చేయాలి.

రాము :—జంకటం మెందుకండీ, చంపేస్తాడా ? చెప్పండి ! మీరే యేర్పాటు చేశారని. కన్నకూతురు డ్యాన్సుచేస్తూ కబురు పంపించకపోతే సగము చచ్చినట్టు పడి వుండక తగుదు నమ్మా అని తగాదాకు వస్తాడా ! రాము తధాకా ఇంకా తెలియదు.

పాపు :—ఒరేరామూ ! లోపలకుపో ! పాపమ్మంటే నీకు కాదూ ! ( అని గెంటివేయును. )

చరణ :—సేఠ్ జీ !

పాపు :—బాబూ !

చరణ :—జమీందారు ఆగ్రహానికి గురియై ఉన్న చెంబు ముంత వీధిలో పారవేసినప్పుడు గొల్లుమని యేడుస్తూ నా కాళ్ళమీద పడిన దినాలు జ్ఞాపకమున్నాయా !

పాపు :—లేకేమి బాబూ !

చరణ :—నేనా సమయములో జోక్యము కలుగజేసికొనక పోతే నీ గతి యేమగునో ?

పాపు :—సర్వనాశనమైపోయి ఉందును.

చరణ :—ఆ ఉపకారానికి ప్రత్యుపకార మిదా ! ఇంత కంటె కృతఘ్నత ఉంటుందా !

పాపు :—బుద్ధి తక్కువ, క్షమించండి.

చరణ:—సేఠ్ జీ! క్షమించవలసిన పాపము నీవుచేయు లేదు. నీకు పిల్లలున్నారు. పితృ హృదయము నీకు తెలుసును. తుచ్ఛ ధనాని కాశించి, కుమార్తె తండ్రికి ద్రోహంచేస్తుంటే నీవు దోహదమిచ్చావు. ఈ పాపాన్ని గౌతమ ఋషియైనా—అహల్యా మానాన్ని హరించిన శచీధవునికే సేవచేసి జగద్వి ఖ్యాతి వహించిన గౌతముడైనా క్షమిస్తాడా!

పావు:—క్షమించలేదు (మోకరించి) మీరు క్షమించాలి.

చరణ:—కృతఘ్నా! శాంతముగా మర్మరధ్వనితో హృద యములో రహస్యముగా దాగివున్న నవరత్నాలను దుహిత యైన లక్ష్మికి చూపిస్తూ ఆనంద మనుభవించే సముద్రుణ్ణి గాలి తుఫానుతో చికాకుపరచావు. శరత్కాలములో నిర్మ లాకాశముమీద నక్షత్రాలమధ్య అమృతము వర్షించే చంద్రు నకు రాహువు నంటగట్టావు. వివిధపుష్ప పరిమళ సంశోభితో ద్యాన వనాన్ని పోగొట్టుకొని తుప్పలమీద పువ్వులతో తృప్తి పడే పిచ్చివాణ్ణి ఆ పొదలలో డాగిఉన్న సర్పాన్ని చూపించి బెదరగొట్టావు. విద్యుద్దీపాలతో విరాజిల్లే సౌధము కూలిపోయి గొల్లుమని యేడ్చే నిరుపేదకు దాతలు కుటీరము కట్టించి చిన్న దీపము వెలిగిస్తే ఆ దీపముతోనే కుటీరానికి నిప్పంటించావు. ఇంత కంటె ఇంకేమి ద్రోహము చేయుగలవు?

పావు:—ఈ స్వల్ప విషయానికింత బాధ పడతావని నాకు తెలియదు. అమ్మాయి అంటే బుద్ధిలేక అంగీకరించాను.

చరణ :—సేఠ్ జీ! దివ్యసౌధాలను నేలమట్టముచేసే భూకంపానికి మానవ రోదనధ్వనుల నర్థముచేసికొని, సానుభూతిని చూపించే లక్షణముండదు. ప్రళయకాల ఝంఝూ మారుతము కోమల వృక్ష లతాదులను పెల్లగించినపుడు తోటమాలి పొందే యమయాతనను ఆ ప్రచండవాయు వర్థము చేసికొనటానికి ప్రయత్నించదు—నీకు ధనము కావలిస్తే నన్నడగరాదా! బంగారపు వర్షము కురిపించి ఉండును నే. నేను కాలికి గజ్జె కట్టి నిలబడితే, మేరుపర్వతము కరగి నీ ఇల్లు నిండిపోయి ఉండును నే!

సావు :—దాసుగారూ క్షమించాలి! ఇంత కొంప మునుగుతుందని తెలియదు. క్షమించాలి! అందాకా మీపాదాలు వదలను. (అని పట్టుకొనును)

చరణ :—సేఠ్ జీ! సముద్రము పొంగింది. హాలాహలము పైకి వచ్చింది. వజ్రాయుధము విచ్చలవిడిగా సంచరిస్తోంది. కాని, ప్రత్యర్థి గడిపోచ. పో! జ్ఞాపకముంచుకో! ఆ సరోజినితో, ఆ నీచురాలితో, ఆకృతఘ్నురాలితో,—(ఆ వేశముపట్టజాలక) తండ్రి పడే బాధ చెప్పవద్దు. అర్థము చేసికోలేను. కృతఘ్నులైన పుత్రులు జన్మించి, ఆ రుచి చూపించినపుడు అర్థమవుతుంది కాని, ఒకమాట—ఈ రహస్య మెవరికి చెప్పవద్దు.

సావు :—నడివీధిలో మాట, ఎవరికి తెలియదు?

చరణ :—ప్రజా ప్రశంసలలో ఉబుకెత్తిన హృదయము ఆ బాధను అర్థము చేసికోలేదు. ఆత్మస్తుతిలో ఆనంద మనుభవించే నేత్రాలు తండ్రి నిట్టూర్పులను వినలేవు. ప్రజాదత్త

సువర్ణ పతకాలలో అంధత్వమొందిన నేత్రాలు నిరాశాగాఢాంధకార పరివృత పితృ ముఖాన్ని చూడలేవు. కాని, సేఠ్ జీ! ఆ పాపము మాత్రము నీవు చేయకు. రహస్యము దాచు.

సేఠ్ :—సెలవా!

చరణ :—ఆగు! నా హృదయములో ఉన్న బాధను వెలిబుచ్చనీ! సేఠ్ జీ! నేను తలుచుకుంటే ఈ భవనాన్ని ఒక నిముషములో ప్రళయకాలాగ్నికి ఆహుతి చేయగలను. అనన్యసాధ్యమైన నృత్యములో ప్రజల కానంద మివ్వగలను. తలచుకొంటే మీ సరోజినీ నృత్యములో గల లోపాలను ప్రజల హృదయాలలో విసరి మళ్ళీ గజ్జె కట్టకుండా చేయగలను. పట్టుదలవస్తే సరోజిని నామరూపాలు లేకుండా చేయగలను. నా కాలికి కట్టిన గజ్జె ఒకటి జారి నేలమీద పడి చేసేధ్వనిలో సహస్రాంశమైన మీ సరోజిని చేయలేదని నిరూపించి నీ పరువుకే భంగము తేగలను కాని, (నిట్టూర్పు వదలి) ఒకానొక కాలములో నాన్నా అని పిలిచి నా హృదయములో ప్రవేశించి, నా పితృహృదయాన్ని రుచి చూచింది కనుక, ద్రోహము చేయలేకపోతున్నాను. (వెడలిపోవును)

చరణ :—నీచురాల! ఎంతైనా పెంపుడుకూతురు కన్న కూతు రవుతుందా! కృతఘ్నురాలు.

(తెర వ్రాలును)

# 8 వ దృశ్యము

( చరణదాసు గోకులదాసు ప్రవేశించెదరు )

చరణ :— గోకుల్ ! నీవంటి సమర్ధులను నేను చూడ లేదు. భరతశాస్త్రములో నీ కద్భుత పాండిత్యముంది. అంగీకరిస్తాను. కాని,

గోకుల్ :— మీ హృదయము నా కర్ధమవటము లేదు.

చరణ :— స్వార్ధము లేని మానవు డీ లోకములో జీవించ లేడు. నా హృదయములో స్థిరనివాస మేర్పరచుకొని దాన్ని దహిస్తూ ఎంత ప్రయత్నము చేసినా శాంతి పొందని దావాగ్ని ఉంది. దాన్ని నీవార్పుతావని వాగ్దానము చేస్తే నీకు నేను సాయము చేస్తాను.

గోకుల్ :— నా శక్తి కతీతము కాకుండా ఉంటే తప్పకుండా సాయము చేస్తాను.

చరణ :— శపథము చెయ్యి, వీణాపాణియై లోకాలను మోహింపజేసే భారతిమీద ప్రమాణము చెయ్యి. అనన్య సాధ్యమైన అగ్నిశోధనలో కూడా నిలువబడి సాధిస్తానని వాగ్దానము చెయ్యి.

గోకుల్ :— ఆపని చెప్పకుండా శపథము చేయగలనా !

చరణ :— ( ఆవేశాన్ని ఆపుకోలేకుండా ) పితృహృదయాన్ని — పవిత్ర ప్రేమతో విహ్వలితమైన పితృహృదయాన్ని

శుష్కింపజేసిన రాక్షసికి ప్రేమలోగల మాధుర్యాన్ని రుచి చూపించి కృతఘ్నతలోగల తీవ్రతతో ఆమె హృదయాన్ని దహింప జెయ్యాలి. ఆపని నీకు సాధ్యమవుతుందా!

గోకుల:—ఆ వ్యక్తి యెవరు?

చరణ:—నాయింటిలో ఉంది, నా కొంప ముంచిన కాలసర్పము, దుహిత నని చెప్పి హృదయములో ప్రవేశించి వల్మీకముగా తయారుచేసిన త్రాచుపాము. హవ్యవాహనుడ నని చెప్పి వచ్చి, కొంప లంటించిన కార్చిచ్చు.

గోకుల: మీ అమ్మాయా?

చరణ:—కాదు. పెంపుడు కూతురు. తండ్రిని నమ్మించి నమ్మించి ఆతడు నేర్పిన విద్యతో ఆతనిని మోసగించి అవమానించిన వంచకురాలు.

గోకుల:—మూఢురాలు. రత్నమని తెలియక కాలితో తన్నిన మూర్ఖురాలు.

చరణ:—గోకుల్! నీ సానుభూతికి నే నపేక్షించలేను. ఆమె పొందే కష్టాలు వర్ణించి నన్ను సంతోషపెట్టలేవు. నీకు శక్తిఉంటే ఆమె హృదయములో ప్రవేశించి, ఆమెస్వప్నాలలో దేవత్వాన్ని పొంది, దివారాత్రాలు ఆమె మస్తిష్కాన్ని ఆనందాలోచనలతో నింపి ఉన్మత్తురాలను చెయ్యి. వివాహ వేదికదాకా లాగి శూన్యహృదయాన్ని చూపించు. చేయగలవా?

గోకుల:—ఇదంత బ్రహ్మాండమైన పని కాదు.

చరణ:—భారతి దేవిమీద ప్రమాణముచేసి చెప్తా.

గోకుల:—మనము నిరంతరము ఆరాధించే మృదంగము మీద శపథమూని చెప్పుతున్నాను. పండిత సభలలో ప్రశంస లిప్పించే గజ్జెలను స్పృశించి వాగ్దానము చేస్తున్నాను. భరత నాట్యాన్ని లోకాని కర్పించిన భరతమహర్షి పాదాలంటి, ఈ కార్యాన్ని సాధిస్తానని విశ్వాసము కల్గిస్తా. సాక్షాద్దేవి చరణా వంటి నీ కోర్కె నెరవేరుస్తానని ప్రతిజ్ఞ పూను తున్నాను. శాంతించు చరణదాసూ!

చరణ:—కాని, గోకుల్! ఆ రాక్షసిని నీవు చూడలేదు. ఆమె నేత్రాలలో యువకులను ఉన్మత్తులనుచేసే మత్తుమందు ఉంది. ఆమె వాక్యాలలో పాషాణ హృదయులను కూడా వేధించి, పీయూష ప్రవాహాన్ని, పైకిలాగే శక్తి ఉంది. ఆమె హాస్యములో కఠిన హృదయాలను కూడా చిగిర్చే పటుత్వముంది. ఆమె తనుద్యుతిలో యోగులను కూడా భోగులుగా మార్చే దావాగ్ని ఉంది. ఆమె గజ్జెల ధ్వనులలో ఋషి హృదయాన్ని కూడా మోహ సామ్రాజ్యములోకి లాగే నేర్పు ఉంది. ఆమె కంఠములో అనేకజన్మలకు పూర్వం అనుభవించిన శృంగార రసాన్ని స్ఫురింపజేసి పాషాణములను కూడా రోమాంచములను కల్గించే మాధుర్యముంది. అత్యద్భుత వేగముతో వచ్చే, ఆమె మోహ ప్రవాహము, అత్యున్నతనగాగ్రము నుండి పడే జలపాతము వలెనుంది. ఆమె శరీరములో విద్యుల్లత, కంఠములో మేఘ గర్జనలు, నేత్రాలలో సుదర్శనజ్వాలలు, ఆమె పదవిన్యాసములో భూకంపము లున్నాయి, జాగ్రత్త!

గోకుల:—చరణదాస్! నేను కళారాధకుణ్ణి, సరస్వతీ చరణకమలాలంటి ఆమె కరుణాకటాక్షాన్ని లోకానికి వెలువరించే దాసుణ్ణి, ఈ ప్రకృతి సౌందర్యము ఆ దేవి చూపించిన సౌందర్యము ముందు అమావాస్యనాటి నక్షత్రకాంతి వంటిది. అమృతము రుచిచూసిన వాడు అరటిపండ్ల వెంట పడడు.

చరణ:—(ఆనందముతో) ఆ మాత్రము ధైర్యమిస్తే నిన్ను సువర్ణ సింహాసనముమీద కూర్చోపెట్టాను. ఈ ధనవంతులను నీ గుమ్మముముందు కట్టివేస్తాను. ప్రపంచములో నిన్ను మించిన నర్తకుడు లేడని కాలికి అందె వేస్తాను. హేమాహేమీలైన కవులచేత ప్రశంసా పద్యాలు వ్రాయిస్తా. నీ పేర కళాశాలలు స్థాపిస్తాను.

గోకుల:—మీవంటి పెద్దల దయఉంటే చాలును.

(తెరలో) నాన్నా!

చరణ:—అదుగో దమ్యాము వస్తోంది. ఆ కంఠములో ఎంత మాధుర్యమున్నదో విన్నావా!

గోకుల్:—మీరీ పూర్వగాథ చెప్పకపోతే ఆమె మధుర కంఠానికి జోహారు చేసి ఉందును.

చరణ:—పూర్వగాథ వినకపోతే భారతీదేవి ప్రత్యక్షమైందని పూజా నృత్యముతో ఆమెను ఆరాధించి ఉందువు.

గోకుల:—(వస్తున్న రజనిని చూచి అర్ధస్వగతముతో) ఔను గుహహృదయాన్నికూడా పాపపుణ్యా చక్షులతో వీక్షించే సౌందర్యమున్నది. ఆగమనము నృత్యాలలోనున్న పరమరహస్యాలను వెదజల్లుతోంది.

చరణ :—ఏమిటి ఆలోచిస్తున్నావు?

గోకుల :— శివుని పాతాళలోకానికి తొక్కుకొని పోతానని గర్వముతో అంబరతలాన్ని వదలి వచ్చేగంగను చూస్తున్నాను.

(రజని ప్రవేశించి గోకుల్‌ను చూచి మోహావిహ్వలిత దృష్టితో గాంచి తండ్రిప్రక్కను నిలబడును. కాని, దృష్టి మరలించుకొనలేక పోవును)

చరణ :—(సంతోషముతో) గోకుల్! చేప గాలానికి తగులుకొంది. రజనీ! ఈ అబ్బాయికి నాకు చర్చజరిగింది. చేప వెళ్ళి గాలానికి తగుల్కొంటుంది అంటాడు. గాలమే చేపకోసము నిరీక్షిస్తూ బాధపడుతుందని నేనంటాను.

రజని :—(గోకుల్‌ను చూస్తూ) చేప వెళ్ళి గాలానికే గుచ్చుకొంటుంది.

గోకుల :—దాసుగారూ! మీ అమ్మాయిపేరు వింటమే కాని, చూడలేదు, విన్నదానికంటె వేయిరెట్లు చూస్తున్నాను.

చరణ :—అమ్మా! ఈతడు కాశీనుండి వచ్చిన సుప్రసిద్ధ నర్తకుడు. హిందూదేశమంతా తిరిగి గౌరవాలు పొందాడు.

రజని :—(తనలో) బంగారానికే వాసన పెట్టాడు బ్రహ్మ.

చరణ :—గోకుల్! ఈమె నా పుత్రిక. తన పవిత్ర ప్రేమతో నా హృదయాన్ని వశము చేసికొన్న పవిత్రహృదయ. కాలగర్భములో లీనమైన భరత నాట్యాన్ని సహజ స్వరూపములో ఆంధ్రలోకాని కర్పించటానికి స్వర్గలోకమునుండి వచ్చిన దివ్యజ్యోతి.

రజని :—నాన్నగారూ! అనవసర ప్రశంసతో నన్నవమా నిస్తున్నారు.

చరణ :—(వికటముగా నవ్వి) అవసరము వచ్చినప్పుడు అర్హతవున్న పండితుల సమక్షములో గర్వానురాగముతో పెంచిన కుమార్తె గొప్పతనానికై తండ్రి వర్ణించకపోతే ద్రోహముకాదా!

గోకుల్ :—దాసుగారూ! తండ్రి సమయము వచ్చినప్పుడు ప్రశంసించకపోతే శత్రుల హృదయము దహించుకొని పోతుంది. అది స్వానుభవము.

చరణ :—చెప్పావుకదూ! తండ్రి సామాన్యప్రజల సంస్తుతికి సమ్మతించకపోతే దొంగతనముగా డ్యాన్సుచేసి బహుమతులను పొందావని.

గోకుల్ :—రజనీదేవిగారూ.—క్షమించండి దాసుగారూ! మీ అమ్మాయితో రెండుమాటలు మాట్లాడాలి. రజనీదేవిగారూ! భరత శాస్త్రములో ప్రతిభ సంపాదించిన మీరు రజని అనేపేరు ఎల్లాగ అంగీకరించారు? భారతిఅంటే బాగుంటుందేమో!

చరణ :—గోకుల్! మొట్టమొదట సంసారములో రక్షించే దిక్కులేక అపనిందలకు పాత్రై రోగివెంటపడి నాదగ్గరకు వచ్చినపుడు ఈ అమ్మాయిపేరు సరోజిని.

గోకుల్ :—అయితే ఈ అమ్మాయి మీ సహజ పుత్రిక కాదన్నమాట.

రజని :—(సిగ్గుపడును)

చరణ :— సహజప్రతికకన్న యెక్కువ. ఆ అర్ధ నగ్న స్వరూపముతో ఆ ధూళి ధూసరిత వస్త్రాలతో, ఆ భయకంపిత గాత్ర నిర్వక్త్రార్తనాదముతో, నిర్ణయానికి రాలేక బెదురుతూ గాలితుఫాను స్ఫురింపజేసే చంచలనేత్రాలతో, అవమానము, సంఘధిక్కారము ప్రతిక్షణం ప్రళయకాల ప్రచండ వాయు తరంగాలుగా వెంటాడుతుంటే కంపించే తనూలతతో ప్రత్యక్షమైన యువతిని నీ వూహించగలిగితే యీ గిఁటెంట వచ్చిన సరోజినిని చూడగలవు.

గోకుల :—అమ్మా! అవమాన దావాగ్నిలో కరిగి దివ్య రూపముతో వెలుగులకు వచ్చిన సువర్ణ విగ్రహానివా!

రజని :—(గోకులను అశ్రుజాలముతో నిండిన నేత్రాలతో చూచును)

చరణ :— గోకుల్! అప్పటికి పదిసంవత్సరాల వెనుక మా రజని చనిపోయింది. (గద్గదస్వరముతో) పదిసంవత్సరాలైనా నిండకముందే అవాఙ్మానసగోచరమైన సౌందర్యముతో మూడు లోకాలను వాత్సల్యముతో నింపి తన కాలి గజ్జెల చప్పుడులో నాదబ్రహ్మన్ని చూపించి, కమ్మదనముతో నాట్యముచేసేది. ఆ రజనిని ఊహాబలముతో జీవింపజేసి నృత్యము నేర్పుతూ ఆనందించే సమయములో ఈ సరోజిని నా చెంతకు వచ్చింది.

గోకుల :—ఆ రజనే యీ రజనైందా!

చరణ :—యోగి చేశాను. పెంపుడు కూతురుగ కన్న కూతురుగా పెంచి పోషించాను. కాని, ఆ స్థానాన్ని ఆక్రమిస్తా నని శపథముచేసి చెప్పింది.

గోకుల :—కాని, స్త్రీల ప్రమాణాలు, అందులో ఆప దలో చిక్కుకుని నిర్బంధముతో విలపించే యువతుల ప్రమా ణాల కర్థముండదు. సాక్షాత్ శ్రీకృష్ణుని మీదనైనా ప్రమా ణముచేసి మానవ హృదయాన్ని కరిగించగలరు.

చరణ :—గోకుల్ ! పొరబడుతున్నావు. మా రజని— మా రజని జ్ఞాపకముంచుకో. తాను ధరించే పూలను నా చేతి కిచ్చి తాకించి తాను ధరిస్తుంది. పాలు తాగాలని వాంఛ ఉన్నా, నా ఆజ్ఞలేందే ముట్టదు. ఒకక్షణము నేనాలస్యముగా వస్తే—జమీందారుతో మాట్లాడుతూ ఒకక్షణ మాలస్య మైనా ఆ వియోగాన్ని భరించలేదు. విలపిస్తుంది. ఆ అశ్రువు లతో వంచన లేదు. ఆ దుఃఖ తిమిరావృత ముఖములో రాజనీతి లేదు. శ్రీకృష్ణపరమాత్ముని సన్నిధిని అర్పింపతగిన పవిత్రము ఆమె హృదయము. ఆ హృదయముతో నన్ను ప్రేమించింది.

రజని :—నాన్నా ! ప్రశంసలతో నన్ను చంపివేస్తున్నారు.

గోకుల :—అమ్మా ! ఉన్నది చెప్పినపుడు బాధపడటము నీ కోమలత్వాన్ని సూచిస్తుంది.

చరణ :—గోకుల్ ! విను. ఆమె నేర్చిన విద్యను చూచి లోకము దిగ్భ్రమచెందింది. ఆమె గజ్జెకట్టి ఆడితే సువర్ణవర్షము కురిపిస్తానంది, ప్రలాభాలు చూపించింది. సువర్ణపతకాలిస్తా

నంది. కాని, మా రజని పితృాజ్ఞను పాలిస్తూ, ఆ ప్రలోభాలను జయించింది. ఇంకొక స్త్రీ అయితే ఏమి చేసి ఉండును!

రజని :— నాన్నా! నేను పోవాలి.

చరణ :— అమ్మా! ఉండు. గోకుల్! ఇంకొక స్త్రీ అయితే తండ్రిని ధిక్కరించి పెంపుడు తండ్రిని— ఒక నాట్య దర్శన మిచ్చేదా! లేదా, ఆతనికి తెలియకుండా ప్రదర్శన మిచ్చి సత్కారాలు పొందదా! కాని, మా రజని అల్లాగ చేసిందా! చేస్తుందా! చేయగలదా! ఇది ప్రేమకు తార్కాణము కాదా!

రజని :— నాన్నా! సెలవు. నే నిక్కడ ఉండ లేను.

గోకుల :— కారణము.

రజని :— తలనొప్పిగా ఉంది. (లేచును)

చరణ :— వెళ్ళి విశ్రాంతి తీసుకో అమ్మా! గోకుల్! విన్నావా! ఇటువంటి రజనికి వివాహము చేస్తే ఆ వియోగాన్ని నే నెల్లాగ భరించగలను. కనుక, నా మనస్సులో ఒక కోరిక ఉంది గోకుల్! (రజనివైపు చూచి) అమ్మా! వెళ్ళి విశ్రాంతి తీసుకో!

రజని :— (లేచి నడవలేనట్లు నటించి కూర్చుండును)

గోకుల :— (వచ్చే నవ్వు ఆపుకొంటూ) ఏమిటది?

రజని :— (తండ్రివైపు చూచును)

చరణ :— ఏ నర్తకునికైనా ఇచ్చి వివాహము చేసి, చెంతనే ఉంచుకొంటాను. ఈ వియోగ బాధ తప్పుతుంది.

గోకుల:— దాసుగారూ! ఈ అమ్మాయి భర్తను ప్రేమించి—

రజని :—(గోకులును ప్రేమదృష్టితో చూచి, భయముతో తండ్రి వైపు చూచును)

చరణ :—గోకుల్! పొరబడుతున్నావు. మా రజని నన్ను తన హృదయములోంచి విసిరివేయదు. నిరంతరము తన యోగక్షేమాలకే పరితపించి, ప్రపంచాన్ని విస్మరించి, తన్ను ప్రేమించే తండ్రి పరిత్యక్తుడైతే ఎంత విలపిస్తాడో మా రజని ఊహించుకోలేదా! (కన్నుల నీరు నుంచి, గద్గదస్వరముతో) మృత్యు ముఖమునుండి వెల్వడి వచ్చిన రజని అని భావించి, పూజించే తండ్రి హృదయాన్ని దహించే అంత మూర్ఖురాలా! కృతఘ్నతను సూచించి, లోకనిందల నాహ్వానించే అంత దుష్టురాలా! దుర్భర వియోగానలములో తండ్రిని మాడ్చి, పరలోకాలను పోగొట్టుకొనే అంత పాపాత్మురాలా! చేసినవంచన లోకానికి చాటి, భర్తృహృదయములో అనుమాన బీజము నాటే అంత అవజ్ఞురాలా! కాదు. మా రజని యెప్పటికి కాదు.

గోకుల :—ప్రేమించే హృదయాలు సత్యాన్ని చూడలేవు.

(రజని మాట్లాడకయే వెళ్ళిపోవును)

గోకుల :—దాసుగారూ! అమ్మాయి వచ్చినపని యేమిటి?

చరణ :—రాక్షసు లెందుకు వస్తారు? మానవ రక్తాన్ని చవిచూడటానికి, దయాదిసద్గుణాలను పెల్లగించి, ఉద్యానవనాలను స్మశానవాటికలుగా చేయుటానికి—

గోకుల :—కళోపాసకుల కింత కర్కశత్వ మీుంటుందని నే నూహించ లేదు.

చరణ :—ఆ నీచురాలు చేసిన ద్రోహానికి నా హృదయము మండిపోతోంది.

గోకుల :—( చూచి ) మళ్ళీ రజని వస్తోంది.

చరణ :—భారతి అను మన నాటకానికి చాల సాయము చేస్తుంది. ( రజని ప్రవేశించి ) నాన్నా ! జమీందారుగా రుత్తరము పంపించారు.

చరణ :—గోకుల్ ! చదువు.

గోకుల :—( నవ్వుతూ ) ప్రభుదర్శనము.

చరణ :—పోదాము రా ! ( వెడలుదురు )

రజని :—ఈ మార్పు నా కర్థము కావటము లేదు. వెన్నలా కరగిపోయే హృదయము పర్వతాలను ఛేదించే వజ్రాయుధ మైంది. షావుకారు మోసము చేయ లేదు కదా !

( తెర వాలును )

# 9 వ దృశ్యము

( టీ పుచ్చుకొనుచు రాధా శ్యాములు ప్రవేశించెదరు )

( రంగము—రాధగది )

శ్యామ్ :—రాధా! మొన్న టీకి పిలుస్తే రాలేదే?

రాధ :—ఆవేళ గోకులును మా యింటికి విందుకు పిల్చాము. మా నాన్న క్రొత్తనృత్యము నేర్పాడు. గోకుల్ ప్రాక్టీసు ఇచ్చాడు.

శ్యామ్ :—నన్ను పిలవలేదే!

రాధ :—పిలిచింది నేను కాదు, మా నాన్న.

శ్యామ్ :—జ్ఞాపకము చేయక పోయావా! భోజనానికి మొగము వాచిన శ్యామ్ ఉన్నాడని.

రాధ :—శ్యామ్! ఈమధ్య నీ వుడికి పోతున్నావు. కారణము నాకు తెలియదు.

శ్యామ్ :—రాధా! నేను మూర్ఖుణ్ణి కాను. పరిస్థితు లర్థము చేసికోలేనంత గాడిదను కాను.

రాధ :—నీ వెంత గాడిద వని కాదు మనము తేల్చవలసింది. నీకు మనస్సులో ఏదో బాధ ఉంది. అది ఏదో స్పష్టముగా చెప్పు.

శ్యామ్ :—మొన్న టీకి ఎందుకు రాలేదు?

రాధ :—కారణము చెప్పాను; మరచి పోతున్నావు.

శ్యామ్ :—కారణ మది కాదు; నాకు తెలుసును.

రాధ :—అయితే, నన్నడగ నవసరమే లేదు.

(టీకప్పు బల్లమీద పెట్టును)

శ్యామ్ :— కాని, రాధా! — ఈ విధముగా ప్రవర్తిస్తావని అనుకోలేదు.

రాధ :—(నిలువబడి) ప్రేమలో అనుమాన ముండదు.

శ్యామ్ :—కూర్చో! (బాధతో) ప్రేమలో మోస ముండదు.

రాధ :—(కూర్చొని) రెండూ ఉన్నప్పుడు ప్రేమకాదు.

శ్యామ్ :—అవును తెలుసును. అది మోహము.

రాధ :—(వికటముగా నవ్వి) ఈనాటికి ప్రేమ మోహమైంది కదూ!

శ్యామ్ :—ఆ మార్పిం దెవరో నాకు తెలుసును.

రాధ :—ఎవరు ?

శ్యామ్ :—నీ అంతరాత్మ నడుగు. నీ మస్తిష్కాన్ని పీడించే స్వప్నాలను అడుగు. నీకు తెలుస్తుంది.

రాధ :—శ్యామ్! బాధ పడవద్దు. గోకుల్ నాకు మిత్రుడు.

శ్యామ్ :—కాదు, ప్రాణప్రియుడు.

రాధ :—అనుమానిస్తున్నావు— బాధ పడుతున్నావు.

శ్యామ్ :—అనుమానము కాదు, నిజము. కన్నతండ్రి కంటె యెక్కువగా ప్రేమించిన గురువుగారినే మోసగించిన నీవు నన్ను మోసగించటములో ఆశ్చర్యము లేదు.

రాధ :—శ్యామ్! మోసగించవలసిన అవసర మేముంది? నేను ప్రేమించలేనంటే, బలవంతముగా గృహములో బంధించటానికి నేను నీ దాసిని కాను. నిష్కల్మష హృదయముతో ప్రేమించే యువతిని.

శ్యామ్ :—రాధా! నీ హృదయములో ప్రేమ ఉంది. కాని, అది నాకొఱకు కాదు —

రాధ :—అయితే, నీ అభిప్రాయ మేమిటి?

శ్యామ్ :—నన్ను మోసగించావని.

రాధ :—అవసరము లేదని చెప్పుతున్నాను. అనుమాన దావాగ్నిలో మాడిపోయే యువకుని వెంబడి ఆశని తిరస్కారాలతో కాలక్షేపము చేయవలసిన అవస్థ పట్టలేదని ఖచ్చితముగా చెప్పుతున్నాను. ప్రకృతి ఇచ్చిన సౌందర్యము, తండ్రి యిచ్చిన విద్య, సంఘమిచ్చిన ప్రశంస, నన్ను సువర్ణ సింహాసనముమీద కూర్చోపెట్టగలవనే నమ్మకము నాకుంది.

శ్యామ్ :—నేను జమీందారు బిడ్డను. ఆ సంగతి జ్ఞాపకముంచుకో—

రాధ :—నేను చరణదాసు పుత్రికను. నీ కే విషయము లోను తీసిపోను. ఆ సంగతి జ్ఞాపకముంచుకో—

శ్యామ్ :—రాధా! నన్ను సర్వనాశనము చేసావు.

రాధ :—నీవే చేసికొన్నావు. నీ అనుమాన పీడిత హృదయాన్ని ఇంతవఱకు దాచి, నన్ను ప్రేమ సామ్రాజ్యములో— కాదు, క్షమించు—మోహ సామ్రాజ్యములో చాలదూరము

తీసికొనిపోయావు. శ్యామ్! పురుషుడు స్త్రీల స్వాతంత్ర్యాన్ని హరించటమే తన విధి అని తలుస్తావా!

శ్యామ్ :—ఇది స్వాతంత్ర్యము కాదు, హృదయ దౌర్బల్యము.

రాధ :—ఆ విషయము నీవు శ్రమపడి నాకు బోధచేయ వలసిన అవసరము లేదు. నా హృదయాన్ని నేను శోధించుకొని జీవించగలను.

శ్యామ్ :—దూర మాలోచించుకో.

రాధ :—అనుమానాలతో క్రుళ్ళి క్రుశించే వ్యక్తితో జీవించటము కంటె హాలాహలము త్రాగటం మంచిది. రామ్ రామ్ శ్యామ్‌బాబూ! నీ కొక సలహా ఇస్తాను విను.

శ్యామ్ :—అంత శ్రమ పడవలసిన అవసరము లేదు.

రాధ :—అవసరము లేదని నాకు తెలుసును. అయినా చెప్పుతున్నాను. రేపు వివాహము చేసికొనే యువతినైనా విశాల హృదయముతో ప్రేమించు.

శ్యామ్ :—అది మీ గోకుల్‌తో చెప్పు, రాధా! సెలవు (అని పోబోవును)

(చరణదాసు ప్రవేశించును)

శ్యామ్ :—గురూజీ! నమస్కారము!

చరణ :—శ్యామ్! ఈవేళ గోకుల్ మా యింటికి విందుకు వస్తాడు, నీవుకూడా రావాలి.

శ్యామ్ :—క్షమించాలి. అధికారములేని స్థానాలను ఆక్రమించ కూడదు.

చరణ :—(నవ్వుతూ) అధికార దృష్టితో పిలవటము లేదు. కళోపాసకుడు అధికారాన్ని ఎఱుగడు. ఆతని రాజ్యములో శాసకుడు లేడు. ప్రేమ రసాన్ని భోగించి ఉన్మత్తులై ఆలాపిస్తూ నృత్యము చేసే యువతీ యువక బృందముతో నిండి ఉంది ఆ రాజ్యము.

శ్యామ్ :—సంగీతములో అప్రబుతులు మీ వంటి పెద్దలు సహించరు. అన్యథాయుక్తచిత్త పదవిన్యాసము తాళానికి సరిపోదు.

చరణ :—ఇంకొక భారము నీ నెత్తిమీద పెటుతున్నాను. గోకుల్‌కు రజనీకి పోటీ. దానిలో నీవు మధ్యవర్తివి.

శ్యామ్ :—నా కంత సమర్థత లేదు, క్షమించాలి. మీరుండగా ఆ స్థానాన్ని నే నాక్రమించ లేను.

చరణ :—తండ్రి ఆస్థానాన్ని ఆక్రమించటము బాగుండదు.

శ్యామ్ :—మొన్న తగాదాలో మీ రాక్రమించ లేదా !

చరణ :—అనుమానము లేని హృదయము నీది కనుక—

శ్యామ్ :—భారతి ఆ విషయాన్ని అంగీకరించదు.

చరణ :—భారతి యెవరు ?

శ్యామ్ :—మీ రజని.

చరణ :—మా రజనియా ! రజనీ !

(రజని తండ్రిచెంతకు వచ్చి) నాన్నా !

చరణ :—శ్యామ్ మధ్యవర్తిగా ఉండటము నీ వంగీకరించవా ! వెఱ్ఱిపిల్ల; దాని కేమి తెలుసును ? శ్యామ్ ! నీ వంగీకరించాలి.

శ్యామ్ :—క్షమించాలి; అనేక కారణాలున్నాయి.

చరణ :—గురుధిక్కారము చేస్తావా! మా రజనే అయితే గురుధిక్కారము చేస్తుందా! గురుధిక్కారము కృతఘ్నత కాదా!

శ్యామ్ :—కావలసినవాళ్లు చేసిన ద్రోహము కనబడదు.

రజని :—నాన్నా! అనుమానముతో బాధపడే హృదయాలు తీర్పు చెప్పలేవు. ఆ హృదయాలకు తీర్పుచెప్పే అధికారము కూడా లేదు.

శ్యామ్ :—అధికారము కోఱకు నేను బాధపడటము లేదు.

రజని :—బాధపడినా లభ్యము కాదుకనూ!

(గోకుల్ ప్రవేశించి చరణదాసును, శ్యామ్‌ను చూడనటుల)

భారతీ!

శ్యామ్ :—(తెల్లబోయి అసూయతో వానిని చూచును)

చరణ :—గోకుల్ వచ్చావా?

గోకుల :—(శ్యామ్‌ను చూచి నవ్వుచు నమస్కరించును)

శ్యామ్ :—(నిర్లక్ష్యముగా నమస్కారమును స్వీకరింపడు.)

గోకుల :—(దగ్గఱకు వచ్చి) శ్యామ్‌బాబూ! నమస్కారము.

శ్యామ్ :—(మొగము త్రిప్పివైచును.)

గోకుల :—(అటువైపు వెళ్ళి) శ్యామ్‌బాబూ! కోపము వచ్చిందా! నమస్కారము.

శ్యామ్ :—(ఆగ్రహముతో) నమస్కారము.

చరణ :—గోకుల్ ! ఆ స్థానానికి శ్యామ్ అంగీకరించ టములేదు. ఏంచేస్తాము ?

గోకుల : —శ్యామ్ బాబూ ! అంగీకరించటము లేదా !

శ్యామ్ :—నా కిష్టము లేదు.

గోకుల :—నామీద కోపమూ లేక, భారతి—క్షమించు, రజని మీదనా !

రజని :—గోకుల్ ! ఎందుకు బ్రతిమాలటము? ఆ స్థానాన్ని మా నాన్న వహిస్తేనే బాగుంటుంది.

గోకుల :— అది నా కిష్టము లేదు.

రజని :—( కోపముతో ) కారణము ?

గోకుల :—పితృహృదయము.

శ్యామ్ :— క్షమించాలి.

రజని :—అనుమాన సంక్షుభిత హృదయా లా స్థానాన్ని ఆక్రమించ లేవు.

గోకుల :—చరణ బాబూ ! మన ఆనందమంతా గంగ పాలైంది ఏం చేస్తాము ? ( ఆలోచించి ) పోనీ; శ్యామ్‌కు రజ నికి పోటీచేస్తే !

చరణ :—శ్యామ్‌తో పోటీకి ఆగ లేదు.

గోకుల :—శ్యామే ఆగ లేడని నా నమ్మకము.

శ్యామ్ :—గోకుల్ ! అభిమాన ముంటే ఆభరణాలు చేయించు, పట్టు దుకూలాలతో సంభావించు—కాని, అన్యాయ మానముతో అత్యున్నత స్థానములో కూర్చోపెట్ట వద్దు.

గోకుల : —శ్యామ్‌బాబూ! నిన్న కాక మొన్న వచ్చాను. ఏ మొండ కా గోడుగు పట్టి, కాలక్షేపము చేసే దేశదిమ్మరు లము. అమ్మేమిటి, అబ్బేమిటి! మాకు ప్రేమేమిటి! విశ్వాస మేమిటి! పెట్టినా, పెట్టక పోయినా అమ్మే.

శ్యామ్ :—( తెగ నవ్వి ) నిజము చెప్పావు గోకుల్! షేక్‌హాండు పారెయ్యి!

గోకుల :—( ఇచ్చి ) కాని, శ్యామ్ మనలో మన మాట; ఏమంటావు ?

శ్యామ్ :—గురువుగారి దయఉంటే నా యెడమ కాలి గజ్జెమువ్వ జయిస్తుంది మీ భారతివంటి కోటిడాన్సర్లను.

చరణ :—నేను చెప్పలేదూ గోకుల్! అతని కభ్యాస మెక్కువని. మా రజని ఈ మధ్య తలనొప్పితో బాధపడుతూ మానసికస్వాస్థ్యాన్ని పోగొట్టుకొని పిచ్చెత్తినట్లు తిరుగుతోంది.

రజని :—గోకుల్! నా గజ్జెనుండి మువ్వ తీసి విసిరి నాట్యము చేయమంటే మీ స్నేహితులు కోటిమంది ఏకగ్రీవ ముగా జోహారుచేసే అంత అద్భుతముగా నాట్యముచేస్తుంది. బాగా ఎక్కడ ఎవరికి ఇవ్వాలో తెలియక మూకుచెవుపుల నీళ్ళు త్రాగేవాళ్ళతో నాకు పోటీ యేమిటి ?

చరణ :—రజనీ! పరాజయముపొందే గుఱ్ఱము ముందు పరవళ్ళు తొక్కి అలసిపోతుంది జాగ్రత్త!

శ్యామ్ :—గోకుల్! సమర్థుడెప్పుడు తన శక్తిని కబు ర్లలో చూపించడు. కట్టమను గజ్జె; తేలుతుంది.

రజని :—గజ్జె కట్టటముకూడ నేర్పాలేమో; గోకుల్ !

గోకుల :—ఎవరికి ?

చరణ :—గురువులయెదుట ఇంత నిర్లక్ష్యముగా మాట్లాడితే ఆ అవమాన మెవరికో తెలుసునా ?

( శ్యామ్ రజనిలు నాట్యముచేయుదురు. చరణదాసు హార్మోనియము వాయించును )

గోకుల :—రజనీ ! సెబాస్ ! నీవు నిజముగా భారతివే.

శ్యామ్ :—గోకుల్ ! అభిమానము పోనిచ్చుకొన్నావు కాదు.

రజని :—గోకుల్ ! నేను మొదటనే చెప్పాను కదా ! నా కాలిమువ్వ జయిస్తుందని.

చరణ :—జయగర్వోక్తులు నైచ్యాన్ని సూచిస్తాయి జయాపజయాలలో సమత్వమే కళారాధకుని ప్రథమ లక్షణము.

శ్యామ్ :—గోకుల్ ! కళారాధకుడు సత్యదేవత నారాధించాలి. క్షుద్రప్రపంచములో సంచరిస్తూ స్వార్థముతో అధ్యక్ష పదవి నలంకరించటము మానవ ధర్మము కాదు. నీ అభిప్రాయము నా కళలో ఉన్న కమ్మదనాన్ని చంపలేదు. కాని, జ్ఞాపకముంచుకో జమీందారుబిడ్డ నవమానించావు ! సర్పముతో చెలగాటా లాడుతున్నావ్ !

చరణ :—శ్యామ్ ! తొందరపడకు. భిన్నాభిప్రాయాలుండవచ్చును. కాని, పరాజయములో బాధపడకూడదు.

( అని శ్యామ్ నోదార్చువానివలె గొనిపోవును )

గోకుల :—భారతీ ! చూసావా ఆ ఆగ్రహము ?

రజని :— భయపడుతున్నావా?

గోకుల :— ఆతని కోపానికి కాదు, ఆతని అసూయాగ్రస్త హృదయానికి. అపనిందలు మోపి, హాళ్యాలు కావించే హృదయానికి.

రజని :— నీ అభిప్రాయము నా కర్థముకా లేదు.

గోకుల:— లేనికళంక మంటకట్టాగు. రజనీలో లేడు గోకుల్ అంటాడు.

రజని :— అది నిజమైనప్పుడంటే తప్పేమిటి?

గోకుల :— భారతీ! నీవుకూడా అనుమానిస్తున్నావా?

రజని :— నేను ఆశిస్తున్నాను, భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

గోకుల :— అంటే?

రజని :— సమర్థుడైన నర్తకుణ్ణి కోరకపోయినా కీర్తి వెంటాడుతుంది.

గోకుల :— అర్థమైంది కాని. ఆ పరిస్థితిలోకూడా ఇక్కడ ఉండటము మంచిదికాదు. ఏడ్చేవాళ్ళుంటే ప్రేమ శోభిస్తుంది. నిర్మలాకాశము, మిణుకు మిణుకుమనే నక్షత్రాలు, చిలునవ్వు నవ్వే చంద్రుడు, ప్రశాంతముగా ప్రవహించే నదులు, మందపవనానానికి శిరఃకంపముచేసే పుష్పాలు, మానవ క్షుద్రపాదాలచే కళంకితము కాని సైకతస్థలము, మనవంటి నర్తకీ నర్తకుల కానందమిచ్చే వస్తువులు. శివజటాజూట భ్రష్టయై విశ్వనాథుని సంధ్యానృత్యము చూస్తూ అనుకరిస్తూ ప్రవహించే గంగానదితత్తీరాలు మనకాశ్రయణీయాలు. అప్పుడే మన ప్రేమ ధన్యమౌతుంది.

రజని :— నరక లోకానికి రమ్మన్నా వస్తాను.

గోకుల :— కాని, ఆశ్రయము మిచ్చి రక్షించిన చరణ దాసుకు ద్రోహము చేయుటము కృతఘ్నత కాదా!

రజని :— గోకుల్! ఈ భారతి ప్రపంచములో ఎవరిని యెఱుగను. ఒక్క గోకుల్ చరణకములా శే యెఱుగను. అక్కడే తన పవిత్రప్రేమ నర్పించింది. ఆ ప్రేమకొఱ కెంత త్యాగమైనా చేస్తుంది.

గోకుల్ :— ఈ మాట లెంతమందిదగ్గఱ చెప్పావో?

రజని :— గోకుల్! నన్ను నవమానిస్తున్నావా!

గోకుల :— ఆ మాత్రము హాస్యము చేయకూడదా? వెళ్ళి, ప్రయాణానికి సిద్ధముగా ఉండు ఈ వేళ రాత్రి—

(రజని వెడలును)

గోకుల :— చాలదూరము లాగుకొని పోతున్నాను కాని, ఆ నిరాశను ఈమె సహిస్తుందో లేదో— పైన భగవంతుడున్నాడు.

గేయం

ఉత్సాహానికి ఉరిత్రాడేగా
దిక్కుమాలినదీ నైరాశ!
బలశాలురకును
పిఱికి నేర్పెడిది
ఆనందమును
మాయము జేసే — దే!

ఉత్సాహానికి ఉరిత్రాడేగా
దిక్కుమాలినదీ నైరాశ!
చింతలు వింతగ
జేర్చునుగా
దుఃఖమ్ములనే
యిచ్చునుగా!
ఉత్సాహానికి ఉరిత్రాడేగా
దిక్కుమాలినదీ నైరాశ!

( తెర వ్రాలును )

## 10 వ దృశ్యము

( ఖడ్గధారియై శ్యామ్ ప్రవేశించును )

ఎన్నిగదులు వెదకినా గోకుల్ కాన్పించటములేదు. పిరికి పంద. కాని, శ్యామ్‌కృపాణము గోకుల్ రక్తాన్ని రుచిచూడకుండా విడిచిపెట్టదు. ఈ మంచముమీద నిద్రపోయింది గోకుల్ అయివుంటాడు.

గోకుల్ ! మీ రజనీ సంస్తుతులలో ప్రపంచాన్నే విస్మరించి, ధర్మాన్ని ధిక్కరించి కళకు కళంక మంటగట్టితివి. పశువా, లే! శ్యామ్ కృపాణములో గల తీవ్రతను రుచిచూడు.

గోకుల్ ( తట్టి లేపును )

( చరణదాసు ప్రక్కమీద కూర్చుండి ) శ్యామ్.

( శ్యామ్ పులకితగాత్రుండై కత్తిని జారవిడుచును )

( చరణదాసు సమీపించి తట్టి ) శ్యామ్!

( శ్యామ్ గురుపాదముల వ్రాలును )

చరణ :—( లేవదీసి ) శ్యామ్ ! ఈ ఉన్మత్తావస్థ యేమిటి?

శ్యామ్ :—గురూజీ ! క్షమించండి, మహాపాపిని.

చరణ :—ఈ వికృతాకార మేమిటి ? కళోపాసకుని చేతిలో కత్తి యేమిటి ?

శ్యామ్ :—అవమానముచేసిన గోకులును చిత్రవధ జేసి నా క్రోధాన్ని శాంతింప జేయాలనే ప్రయత్నము.

చరణ :—శ్యామ్! ఇంతమౌనమేమిటి? రా, కూర్చో! అభిప్రాయ భేదాలుంటే హాత్యాకాండలోకి దిగటమా! గోకుల్ గౌరవించనంత మాత్రాన నీ కళలోఉన్న కమ్మదనము నశిస్తుందా?

శ్యామ్ :—కాని, నా రాధను అపహరించాడు.

చరణ :—శ్యామ్—రాధ యెవరు?

శ్యామ్ :—క్షమించండి!

చరణ :—నా కింతకుముందే తెలుసును. భయములేదు. చెప్పు. భయములేదు!

శ్యామ్ :—క్షమించాలి.

చరణ :—ఆ రజని నిన్నవమానిస్తే ప్రతీకారము చూపించవలసింది రజనిమీదనా గోకుల్ మీదనా!

శ్యామ్ :—కామాంధులు వివేకహీనులు.

చరణ :—శ్యామ్! రజని నీ వెంట పడటము నీకు గౌరవమా; నీవే ఆమెవెంట పడటము గొప్పా; ఆలోచించుకో. రజని యెవరో తెలుసునా! వీధులవెంబడి సంచరించే భిక్షుకురాలు. అవమానసంక్షుభిత హృదయ. ఆర్త. నీవో ఆగర్భ శ్రీమంతుడవు. సమస్త విద్యా పారంగతుడవు. కవిహృదయములో ప్రవేశించి, భావాన్ని అర్థముచేసికొని అనుభవించి రసోన్మత్తుడవై నాట్యముచేయుగల ధీమంతుడవు. రజనికి నీకు పోలిక లేదు. అటువంటి రజని నిన్ను ప్రేమించలేదని హత్యాకాండలోనికి దిగుతే ఆ అవమాన మెవరికి? ఆ నష్ట మెవరికి?

శ్యామ్ :—గురూజీ! అహంకార ముద్రిత హృదయ మంతమూరము పోలేదు.

చరణ :—నీవు చెప్పినట్లు గోకులుడు రజని ప్రేమిస్తే అతని చిత్రవధను ఆమె భరిస్తుందా! సహిస్తుందా! ప్రతిక్రియ చేయదా! లేక స్త్రీ కనుక, ఆత్మహత్య చేసికొనదా! అప్పుడా బాధ యెవరిది? నాకు కాదా! నీకుదాంట్లో భాగముండదా! నీవు హంతకుడవైతే నీ తండ్రి యెంత దుఃఖిస్తాడు, ఆలోచించుకొన్నావా!

శ్యామ్ :—అంతమూర మాలోచించలేదు ప్రభూ!

చరణ :—హంతకుడవైతే నీ వెంత అధమ స్థితికి వస్తావో ఆలోచించావా! నిన్ను ప్రాణముకంటె యెక్కువగ ప్రేమించిన తండ్రిహృదయములో దావాగ్ని ప్రవేశించి ఎంత బాధిస్తుందో ఊహించుకొన్నావా! ఒక స్త్రీకొరకు ఇవతల గురువును, అవతల తండ్రిని హింసించటము పండిత లక్షణమా! ఆలోచించావా!

శ్యామ్ :—గురూజీ! మాటలలో నన్ను చంపకండి. ఇదివరకే చచ్చిపోయాను.

చరణ :—శ్యామ్! ఇప్పటికైనా రజనిపై మోహాన్ని వదలి, ప్రతిక్రియకు పసువులెత్తే హృదయాన్ని కళోపాసనకై వినియోగిస్తావా!

శ్యామ్ :—మీ పాదా లంటి చెప్పుతున్నాను. ఇక రజని పేరెత్తను. ఆమెను నాహృదయములోంచి విసిరివేస్తాను.

చరణ :—శ్యామ్! శపథముచెయ్యి, సరస్వతీదేవిమీద. రజనీ వార్తలను ఎవరితో చెప్పనని శపథము చెయ్యి.

శ్యామ్ :—గురూజీ! సరస్వతిమీద శపథముచేసి చెప్తున్నాను. రజని నాకు సోదరి. ఆమె మానప్రాణాలు రక్షించటానికి సర్వవిధాల యత్నిస్తాను.

(ఇంతలో తలుపు చప్పుడు)

చరణ :—వస్తున్నా! శ్యామ్! ఆ కత్తిని పరుపుక్రింద పెట్టి, ఆ ప్రక్కగదిలో ఉండు.

(తలుపు తీయును. కంగారుతో శాంతారావు ప్రవేశించును)

శాంతా :—(కంగారుతో) శ్యామ్ వచ్చాడా!

చరణ :—అంత కంగారు పడుతున్నారే!

శాంతా :—శ్యామ్ కత్తి పుచ్చుకొని పిచ్చియెత్తినట్లు రోడ్డుమీదపడి పోతున్నాడని సేఠ్‌జీ వచ్చి కంగారుతో చెప్పాడు. ఒకళ్ళజోలి కెప్పుడు వెళ్ళని శ్యామ్‌చేతిలో కత్తి యెందుకు వచ్చిందా అని—కంగారుతో మీకు తెలిసి ఉంటుందని వచ్చాను.

చరణ :—పిరికి సేఠ్‌జీ కత్తి చూడగానే కంగారుపడి మీతో చెప్పిఉంటాడు.

శాంతా :—కాదు; ఈమధ్య ఆతని వాలకము నాకుకూడ అనుమానముగానే ఉంది. ఏదో పోగొట్టుకొని వానిబాధ అనుభవిస్తున్నాడు. దీర్ఘనిశ్వాసాలు, ఆత్మగతాలు, అనవసర

ముగా పండ్లు పటపట కొరకటము, కారణములేకుండా ముఖ మొత్తబారటము— ఈ లక్షణాలన్నీ నిరాశను సూచిస్తున్నాయి.

చరణ :—అయితే శ్యామ్ విషయములో అనుమానిస్తు న్నారా!

శాంతా :—ఈ చిట్టి పక్షిని వల మీ యింట్లోనే ఉందని పుకారు.

చరణ :—అయితే రజనిని ప్రేమించాడనా! ఆ ప్రేమలో బాధ పడుతున్నాడని మీ అభిప్రాయమా!

శాంతా :—మీకు కోపము రాకుండా ఉంటే అంతే.

చరణ :—కోపమెందుకు! యీ సంబంధానికి ఏమి లోటు? కాని, రజని పెండ్లి చేసుకోనంటోంది.

శాంతా :—ఎవరైనా స్పష్టముగా చెప్పారా!

చరణ :—సూచనలైనా లేవు.

శాంతా :—అయితే శ్యామ్ సంగతి తెలియదా!

చరణ :—ఇప్పటిదాకా ఖడ్గ నృత్యముచేసి, అలసిపోయి ఆ ప్రక్కగదిలో నిద్రపోతున్నాడు.

శాంతా :—దాసుగారూ! వాడు నిద్ర వదలి చాల దినా లైంది. ఏదో ఆలోచిస్తూ రాత్రులు గడుపుతాడు.

చరణ :—మీరు రడగక పోయారా!

శాంతా :—అడుగుతే చెప్తాడా! కళోపాసకుణ్ణి; వివాహా మెందుకంటాడు. కేకవెయ్యండి. మీ యెదుటనే ఆ విష యము తేలుస్తాను. రజనినికూడ కేకవేస్తే ముహూర్త మీవేళే నిశ్చయమవుతుంది.

చరణ :—శ్యామ్ ఇల్లాగా ! మీ నాన్నగారు వచ్చారు.

(శ్యామ్ ప్రవేశించును)

చరణ :—శ్యామ్ ! నేను మొట్టమొదటనే చెప్పలేదా ! ఖడ్గనృత్యము నేర్చుకొనేవాడవు, కత్తి తెచ్చేటప్పుడు మీ నాన్నగారితో చెప్పవద్దూ ? ఆయన కంగారుపడుతూ అర్ధరాత్రివేళ వచ్చారు.

శ్యామ్ :—క్షమించండి.

శాంతా :—(నవ్వుతూ) అవసరములేదు నాయనా ! ఆ కొంచెము వార్త చెవినివేస్తే ఇంతకంగారు ఉండకపోను కదా ! దాసుగారూ ! మీ రజని కేకవేయుండి. అర్ధరాత్రి వేళైనా ఆ కొంచెము మాట విని వెళ్తాను.

చరణ :—ఆమె యిక్కడలేదు, శాస్త్రీయనృత్యపు పోటీలకు వెళ్ళింది, జాగ్రత్త అని నౌకరులను వెంట పంపించాను.

శాంతా :—దాసుగారూ, మీరు వెళ్ళకపోయారా ! చిన్న పిల్లను ఒంటరిగా పంపించటము మంచిదికాదు. పైగా అక్కడ ఎరుగున్నవాళ్ళు చాలమంది ఉన్నారు.

చరణ :—అవసరములేదు. ఆమెస్వభావము నాకుపూర్తిగా తెలుసును; అనుమాన మొందవలసిన అవసరములేదు.

శాంతా :—అనుమానించమని కాదు నా అభిప్రాయము. మీరుకూడా ఉంటే ఏమీ లోపము ఉండదని—

చరణ :—నా కిక్కడ కొంచెము పని ఉంది.

శాంతా :—ఇప్పుడు మీ రభినవద్రోణులని అర్థమైంది.

శ్యామ్ :—సందేహమేమిటి!

శాంతా :—శిష్యప్రేమకు పుత్రప్రేమను బలియిచ్చిన మహాత్ములు.

శ్యామ్ :—నిస్సందేహముగా.

చరణదాసును మించిన సజ్జనుండు
జగతి లేడు లేడని నేను చాటగలను
ద్రోణుం డన నెంత, వధియించు తుచ్ఛశిష్యు
నైన ప్రేమించి రక్షించు నార్యు డితడు.

శాంతా :—ఆ పోటీ లెపుడు?

చరణ :—రేపే!

శాంతా :—మనము వెళితే మంచిదేమో!

చరణ :—సమయము దాటిపోయింది.

శాంతా :—సరే, దాసుగారూ! నేను వెళ్ళి వస్తాను. శ్యామ్ వస్తావా!

చరణ :—శ్యామ్, వెళ్ళి రా!

(నిష్క్రమించెదరు)

చరణ :—నాటక మాడుతున్నాను, ముగిం పెల్లాగో నాకే తెలియుటము లేదు. ఆఖరురంగ మెల్లాగ ముగుస్తుందో. చాల రాత్రి అయింది, నిద్రపోతా.

(తెర వ్రాలును)

# 11 వ దృశ్యము

గోకుల :— భారతీ ! కాశీలో విశేషాలు చూశావా !

భారతి :— కాశీలో విశేషాలు చూడటానికి రాలేదు. నా అభిప్రాయము నీతో ఎంతో స్పష్టముగా చెప్పాను. అయినా ఈ నిర్లక్ష్యము నా కర్థముకాలేదు.

గోకుల :— మన వివాహము జరిగేముందు చిన్నప్పుడు నన్ను గారాబముగా పెంచిన తండ్రిఆజ్ఞ కావాలి. ఆయన ఆశీర్వాదము కావాలి. తంతిచ్చాను. ఈపాటికి రావలసిందే. ఆయన రాగానే వివాహము జరుగుతుంది. ఇంతలో తొందర యెందుకు ?

భారతి :— గోకుల్ ! నీ వింతపిచ్చివాడవని నే ననుకోలేదు.

గోకుల :— భారతీ ! అందరు నీ అంత సాహసము చెయ్యలేరు. అపరిచితుణ్ణి నమ్ముకొని తండ్రికి ద్రోహముచేసే అంత ధైర్యము నాకు లేదు. కని పెంచినవాళ్ళకు ద్రోహముచేస్తే పరలోకాలుండవనే బాధ నన్ను పీడిస్తోంది.

భారతి :— ఎవరిపిచ్చి వాళ్ళ కానందము.

గోకుల :— అరుగో, మాటలోనే వచ్చారు.

( చరణదాసు యతివేషమున ప్రవేశించును )

( రజనీ గోకులులు నమస్కరించెదరు — యతి ఆశీర్వదించును )

చరణ :— గోకుల్ ! ఈ అమ్మాయి ఎవరు ?

గోకుల :—ఈమెపేరు భారతి. మీరంగీకరించి ఆశీర్వదిస్తే నా అర్ధాంగి.

చరణ :—( నిమీలిత నేత్రుడై ) భారతీ!

భారతి :—( ఆశతో ) ప్రభూ!

చరణ :—నీ మొదటిపేరు సరోజినికదూ!

భారతి :—( ఆశ్చర్యముతో )అవును ప్రభూ!

చరణ :—కవి ఉన్మత్త ప్రలాపాల కుబ్బి ప్రజానిందలకు గురియై రక్త ప్రవాహములో తేలి ఆడుతూ అంబికా దేవాలయములో ఒక యోగిని ఆశ్రయించావు కదూ!

భారతి :—( ఆశ్చర్యముతో ) ప్రభూ! తమరు త్రికాల వేదులు.

గోకుల :—స్వామీ! మీరు పరశివులు.

చరణ :—సరోజినీ! ఆ యోగి నిన్ను చరణదాసను వర్తకుని యింటికి తీసికొని వచ్చాడుకదూ! ఆ సమయములో చరణదాసు—ఆగు—ఆ దృశ్యము తలుచుకొంటే నా గుండెలు బ్రద్దలవుతున్నాయి. ఊపిరి ఆడటము లేదు—చనిపోయిన దుహితకు ప్రాణముపోసి నృత్యము నేర్పుతున్నాడు కదూ!

భారతి :—ప్రభూ! పూర్వకథలను జ్ఞప్తికి తెచ్చి నా హృదయాన్ని దగ్ధము చేస్తున్నారు.

గోకుల :—స్వామీ! తమరు మానవ హృదయములో అతి రహస్యముగా దాగిఉన్న రహస్యపరమాణువులనుకూడా పైలాగగల ప్రతిభాశాలురు.

చరణ :—అప్పుడు నీవు రజనివై నావు. ఆ దాసు నిన్ను తన కన్న పుత్రికకన్న యెక్కువ గాఢముగా ప్రేమించి విద్య నేర్పాడు.

భారతి :—ఆ ఉపకారాన్ని వెయ్యిజన్మలకైనా మరువ లేను స్వామీ !

గోకుల :—కృతజ్ఞత మానవులలో దొరకని విచిత్రవస్తువు.

చరణ :—రజనీ! తండ్రికి తెలియకుండా సాహుకారు ప్రోత్సాహమువలన రాధా నృత్యమని ప్రజాసంస్తుతులకు ప్రాకులాడి ప్రచురించి మీ తండ్రిని మోసగించావు. ఇది కృతఘ్నత కాదా!

గోకుల :—కాదని యెవరన గలరు ?

భారతి :—మా తండ్రికి నాకు వచ్చే పేరు చెడగొడుతున్నా డనే దురభిప్రాయముతో ఆ పాపాని కొడిగట్టాను స్వామీ !

చరణ : —ఆ కృతఘ్నత నీ తండ్రి హృదయాన్ని ఎంత దహింపజేసిందో నీకు తెలుసునా !

భారతి :—అనుమానించాను కాని, నిశ్చయించ లేక పోయాను ప్రభూ !

గోకుల :—స్వామీ ! నేను గ్రహించాను; ఆ హృదయ ములో పరాభవాగ్ని ప్రజ్వరిల్లుతున్నా—దయార్ద్రహృదయుము కనుక — మంట పైకి రాలేదు.

చరణ :—జమీందారు బిడ్డయిన శ్యామ్‌తో కలసి తిరిగి, ఆతని గంగపాలుచేశావు. అప్పుడు నీ పేరేమిటి ?

భారతి :—( గద్గదస్వరముతో ) రాధ

గోకుల :—( ఆశ్చర్యాన్ని ప్రదర్శిస్తూ ) భారతీ ! నీవు శ్యామ్‌ను ప్రేమించావా!

భారతి :—( మౌనము వహించును )

చరణ :—గోకులును చూచి ఆతని ప్రేమకు స్వస్తిచెప్పావు, అది కృతఘ్నత కాదా !

భారతి :—స్వామీ ! మీరు నా చరిత్రను వ్రాసగ్రుచ్చి నట్లు చెప్పి నా కొంప ముంచారు. ఎంత ప్రయత్నించినా దాట శక్యముకాని అగాధ సముద్రాన్ని కల్పించి గోకులును వేరు చేసారు. ఇంక అతని మీద ఆశ లాభములేదు.

గోకుల :—భారతీ ! యీ పవిత్ర ప్రేమతోనా నన్ను వివాహముచేసికొని సంసారసౌఖ్య మిప్పిస్తానని మురిపించావు ?

భారతి :—క్షమించు గోకుల్ ! అది యౌవనదర్పము వలన చేసినపని. కాని, యీద్రోహముమాత్రము మా తండ్రితో చెప్పకు. ఆతనిహృదయము దుఃఖముతో వ్రక్కలవుతుంది.

చరణ :—ఆమాత్రము జాలిఉంటే ఇంతద్రోహము చేయ గలవా! ఇందులో నీ తండ్రికి తెలియని యంశ మణుమాత్ర మైన కలదా ! ( అని గడ్డము, మీసము తీసివేయును )

భారతి :—గోకుల్ ! ఇంతద్రోహము చేస్తావని అనుకోలేదు.

గోకుల :—ఇది ద్రోహముకాదు. గురువున కిచ్చిన వాగ్దానము. కళోపాసకుడు వ్రానిన దీక్ష. అనింద్య సౌందర్యము కల

యువతి కూడ, ప్రేమవిహ్వలితయువతికూడ — కళోపాసకుణ్ణి చలింప చేయలేదనే సత్యాన్ని ప్రకటించి, నాట్యకళ కంట గట్టిన కళంకాన్ని క్షాళితము చేయాలనే పట్టుదల. ఇది ద్రోహముకాదు.

భారతి:—తండ్రీ! ఏమైనా జాలిలేదా!

చరణ:—కృతఘ్నులలో గల మాధుర్యాన్ని చూపించా అనే తీవ్రవాంఛ.

భారతి:—ఇప్పుడర్థమైంది ఈ ప్రపంచములో ఉండే ప్రేమ తత్త్వము. ఆశ్రయించినవాళ్ళను అధఃపాతాళానికిఅణగద్రొక్కే పటుత్వముందని తేలింది. ఈ మానవహృదయము పరుల పొరపాట్లను క్షమించలేదు. ఈ లోకపుప్రేమ వడ్డీవ్యాపారాలతో నిండిపోయింది. అటువంటి చంచలమైన ప్రేమను నమ్ముకొని ఎండమావుల వెంటాడి మరణించటముకంటె మురారి పదాలాశ్రయించిజీవించటము మంచిది. హంసతూలికా తల్పము మీదశయనించి ఆనందమను భవించాలని కోరాను. కాని, ఆ హంసతూలికాతల్పములో ఆనందము లేదని తేలింది. మాధవుడు తనాశ్రయించిన వారిలో పాప పుణ్యాలను చర్చించడు. ఆర్తత్రాణపరాయణత్వ మాతని సొమ్ము. చరణదాసూ! నేను చేసిన ద్రోహాలకు నన్ను క్షమించి ఆశీర్వదించు. నీవు నేర్పిన నృత్యములో భగవంతుని సేవించి భక్తిమార్గములో తరించి, యితరులను తరింపజేసేటట్టు ఆశీర్వదించు. గోకుల్! మానవ హృదయ తత్త్వాన్ని బోధించావు. నీకు ధన్యవాదాలు!

చరణ :—రజనీ !

భారతి :—మీ రజని చనిపోయింది.

గోకుల :—భారతీ !

భారతి :—గోకుల్ ! నేను భారతిని కాను, గోపికను శ్రీకృష్ణపరమాత్మను ఆరాధిస్తూ తన్మయత్వాన్ని పొందే గోపికను. నాకీ ప్రపంచముతో సంబంధము లేదు. జై శ్రీకృష్ణ పరమాత్మకు జై !

చరణ :—మా రజని రెండువర్యాలు మృత్యుముఖములో ప్రవేశించిందా !

భారతి :—చరణదాసూ! ఈలోకసంబంధమైన మోహాన్ని వదలివెయ్యి. కళంకినిగా వచ్చాను. కృతఘ్నురాలుగా వెళ్ళిపోతున్నాను. సెలవు.

గే యం

వ్యామోహంబున పడి పోవకురా
జీవన సౌఖ్యము గోల్పోవకురా !
తరుణీ సౌఖ్యమె
ఘన ధనమంచును
వృథా పోహాలను
గాంచకురా !
వ్యామోహంబున పడి పోవకురా
జీవన సౌఖ్యము గోల్పోవకురా !

జగన్నాటక కర్తవు
సత్యమునుకంగర
శాశ్వత సౌఖ్యము
గోరరా !

వ్యామోహంబున పడి పోవకురా
జీవన సౌఖ్యము గోల్పోవకురా !

( అని వెడలును )

చరణ :—గోకుల్ !

గోకుల :—చరణదాసు భగ్నహృదయుడు.

చరణ :—నా గతి యేమిటి ?

గోకుల :—శాంతించు. ధైర్యము వహించు.

చరణ :—ఆ హృదయము భగ్నమైతే యెంతదూరము పోతుందో గుర్తించలేక పోయాను, మూర్ఖుణ్ణి.

గోకుల :—ప్రతిక్రియలో గల పాప మర్థమైందా !

చరణ :—రజనీ ! రజనీ ! ( అని వెడలును )

( తెర వ్రాలును )

# 12 వ దృశ్యము

(చరణదాసు విరాగివేషమున పాడుచూ ప్రవేశించును)

గేయం

ప్రేమ వీధులలోన విహరించుతావా!
స్వర్గ సౌఖ్యాలను గూల్చు కొంటావా!!
మోహ పిశాచికి
బలియగు వారలు
వీరులు గారని
తెలియరా!
ప్రేమ వీధులలోన విహరించుతావా!
స్వర్గ సౌఖ్యాలను గూల్చుకొంటావా!!
ఆవేశంబున
అతివలగూడి
జీవనశాంతిని
చితికిడుతావా!
ప్రేమ వీధులలోన విహరించుతావా!
స్వర్గ సౌఖ్యాలను గూల్చు కొంటావా!!

రజనీ వియోగము భరించలేక పోతున్నాను. గారాబముగా పెంచిన మొక్క, వివిధపుష్ప సంశోభిత లతను, కంటకమూ గ్రుచ్చుకొందనే ఆగ్రహముతో, క్రోధారిక్తై ప్రతిక్రియచేయా

లనే అహంకారముతో పెల్లగించి అవతల పారవేశావు. ఏ అదృష్టవంతుడు దాన్ని తన ఉద్యానవనములో నాటుకొని భోగా లనుభవిస్తున్నాడో. గోకులునకు జమీందారీ ప్రాప కము లభించింది. శ్యామ్ అనుకూలవతియైన భార్యను పొంది తండ్రికి ఆనందము చేకూరుస్తున్నడు. అహోరాత్రాలు మా రజనీ సరోజినులు పాటాలు వేసికొని వచ్చి, నా మస్తిష్కాన్ని తిని వేస్తున్నారు. హే దీనదయాళో కృష్ణా! ఆపన్నులమీద కొంచెమైనా కనికరము లేదా! మా రజనిని ఒక్కపర్యాయము చూపించు. ఒక్కసారి నాన్నా అని అనిపించు. ఆమెను, నా దీన దశను చూచి ఒక్కసారి వేడినిట్టూర్పును వదలనీ, అదే నాకు బ్రహ్మానందము. తృప్తిపొందుతా! రజనీ! ఒక్కసారి వచ్చ్వా, అదే నాకు చాలును.

( తెర యెత్తుదురు )

( దేవాలయములో పూజసేయుచు రజని ప్రవేశించును )

గేయం

కృష్ణా! కృష్ణా! మురళీధారీ!
కృష్ణా! కృష్ణా! మురళీధారీ!!
పేద కుచేలుని వేడుక దీర్చి
ధనవంతునిగా జేసితివే!
కృష్ణా! కృష్ణా! మురళీధారీ!
కృష్ణా! కృష్ణా! మురళీధారీ!!

రాధాలోలా రావిది మేలా
నిను నాయదిలో నమ్మితి చాలా!
కృష్ణా! కృష్ణా! మురళీధారీ
కృష్ణా! కృష్ణా! మురళీధారీ!!

కృష్ణా! దీనదయాళో! నేను కృతఘ్నుఁగాలను. కన్నతండ్రికన్న ఎక్కువ గారాబముగా పెంచిన తండ్రిని మోసగించి అందరాని పండ్లు కాసించి నగుబాట్లు మునాను. క్షమించటానికి సాధ్యముకాని పాపముచేసాను. ఐనా తండ్రి క్షమించి తనతో నివసించమన్నాడు. కాని, తాత్కాలిక వైరాగ్యములో ప్రేమ ప్రపూరితహృదయుణ్ణి తండ్రిని చెండనాడుకొని నీ పాదాలాశ్రయించాను. కాని, మనస్సుకుమాత్రము శాంతిలేదు. చరణదాసు చరణాలమీద పడి క్షమింపమని వేడి ఓక్కసారి యేడ్వాలని బుద్ధిపుట్టోంది. (ఆలోచించి) కృష్ణా! నీ భక్తుల కింత శోధనలెందుకు? ఈ హృదయము నీ కర్పితమైంది. దాన్ని బాధించటమెందుకు! అనుకొంటున్నావా! నీ యిష్టము!

( యోగిపాడుచూ ప్రవేశించును )

గేయం

ఈమనిలీలా మెఱుగగ గలరా
అవివేకులు భువిలో!
ప్రభుపాదంబుల భక్తిని గొలిచీ
స్థిరసౌఖ్యంబును గనరా మూఢా!
వ్యర్థవివాదము ఫలమేమున్నది
సంప్రార్థనము సలుపరా! మూఢా!

ఈసునిలీలా యెఱుగగ గలరా
అవివేకులు భువిలో!
హితమార్గంబుల విడవకను
అతిశయ మెంతయు పొందకను
స్వర్గ సుఖంబులూ పొందగలేరు
నరకంబప్పుడు తప్పదుగా!
ఈసునిలీలా యెఱుగగ గలరా!
అవివేకులు భువిలో!

అమ్మా! రజనీ! క్షమించు. విచార సముద్రములో మునిగి లయమొందే జీవి మోక్ష సామ్రాజ్యాని కధికారి కాదు.

రజని :—దయచెయ్యండి. నా పరివ ర్తనానికి నేను విచారించను. కాని, చరణదాసు స్థితి వూహించుకుంటే నా హృదయము తరుగుకొని పోతోంది.

యోగి :—అమ్మా! శాంతించు. పొర్లిపోయిన పాల కమ్మదనము జ్ఞాపకము రావటము మన బాధకే కాని, ఆనందానికి కాదు.

( చరణదాసు దేవాలయములో ప్రవేశించి )

రజనీ! ( అని పిలచును )

రజని :—ఎవరు? నా పేరు రజని కాదు, చరణదాసి.

చరణ :—కావు, నీవు చరణదాసివి కావు. మా రజనివి, పితృహృదయాన్ని వివిధపుష్పాలతో అలంకరించిన మా రజనివి. కాని నీవు చరణదాసివి కావు. పితృ నేత్రాలనుండి దాగ

లేవు. ఆనందము పట్టుదల మధ్యల నూగులాడే హృదయము, దాన్ని ప్రతిఫలింపజేసే ముఖము, పితృ వాక్యాలలో వుండే మాధుర్యాన్ని గ్రోలాలని ఆతురమొందే శ్రోత్రాలు, నాట్య శాస్త్రములో సుపరిచితములైన పదములు, హావప్రదర్శన మందారి తేరిన భ్రూకుటి, హృదయాంతర్గత సూక్ష్మభావాలను గూడా వెలువరించే నేత్రాలు—ఇవన్నీ చూడ నీవు మా రజనివని సాక్ష్యమిస్తున్నాయి. భరించటానికి వీలులేని దీర్ఘ నిశ్వాసము, ఆ విశ్వాసాన్ని బలపరుస్తోంది. రజనీ! నీవు మా రజనివి. 'ఊ' అను మృత్యుశయ్యమీద పడియున్న పితృహృదయానికి 'ఔ' అనే సంజీవిని పోసి బ్రతికించు.

## గేయం

పశ్చాత్తాపము పడిన వారికి
పాపఫలంబులు లేవూ!
హంతకుడైనా
తన యెదలోనా
చేసినపనికీ
చింతిలు వేళ
పశ్చాత్తాపము పడిన వారికి
పాపఫలంబులు లేవూ!
పరధనములను
దోపిడిచేయు

వానికి చింత
సుఖదాయి !
పశ్చాత్తాపము పడిన వారికి
పాపఫలంబులు లేవూ !
పరమేశుండే
సంప్రీతిదొడై
పాపులనవుడే
ఆశీర్వదించు !
పశ్చాత్తాపము పడిన వారికి
పాపఫలంబులు లేవూ !

(రజని పరిహాసించి) నాన్నా! (అని ఆలింగనముచేసు కొందురు)

అందరు కరతాళ ధ్వనులు చేయుదురు

(తెర వ్రాలును)



# నవ్య నాటకములు

## దీవార్ కే రాతిగోడ

విచ్ఛిన్న సామ్రాజ్యాన్ని ఏకసామ్రాజ్యముగా స్థాపించిన [డ్రామా]
రచయిత :—అయిలావఝ్ఝుల సూర్యప్రకాశశర్మ B. A. B. ED. ఈ నాటకములో అనేక సమస్యలు చర్చించబడ్డాయి. స్త్రీల తత్వాలు విశదీకరించబడ్డాయి. ముఖస్తుతి పరాయణులు కల్పించిన ప్రమాదకరములైన రచనలు ప్రదర్శింపబడ్డాయి, మతానికి మానవ జీవితములో గలస్థానము యిందు నిరూపింప బడినది. చదివి ఆనందించండి. వెల రు. 1—8—0

## తాన్‌సేన్ (డ్రామా)

రచయిత :—అయిలావఝ్ఝుల సూర్యప్రకాశశర్మ B. A. B. ED. కళాప్రపంచాన్ని శాసించే తాన్ సేన్ అక్బరు ఆస్థాన మలంకరించేటప్పుడు చెప్పినమాటలు వింటూవుంటే కళారాధకుల హృదయాలను ఎంత వేదిస్తుందో యీ నాటకములో విపులముగా తెలుసుకో గలుగుదురు. వెల రు. 1—8—0

## భక్తపోతన (అనన్య సామాన్య నాటక ప్రచురణము)

రచన :—కవితావిశారద శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A శృంగారలోలుడై విరాగప్రవృత్తినార్జించి ఐహిక సుఖాలకు తిలోదకాలనిచ్చి రామనామాంకితధ్యానియై స్వర్లోకపదవి నలంకరించిన రామభక్తుని దివ్యచరిత్ర—

# నవ్య నాటకములు

రసవత్తరముగా రంగానుకూలముగా ప్రదర్శన కుప యుక్తమైన మహత్తర నాటకము. వెల రు. 1—8—0

## భక్త త్యాగయ్య (తులలేని తెలుగు నాటక ప్రచురణము)

రచన:—కవితావిశారద శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A బ్రతికివున్నాళ్లు తారకమంత్రోచ్చారణచేసి తమిళదేశీయుసావాసమొనర్చిన తెల్గుతనాన్ని సార్థకపఱచుకొన్నధన్యజీవి త్యాగయ్య. ఆ పవిత్రమూర్తి ఆదర్శ చరిత్రనవ్యనాటకంగా వెలువడింది. వెల రు. 1—8—0

## ప్రచండ భీమకవి (సాటిలేని మేటి నాటక ప్రచురణము)

రచన:—కవితావిశారద శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A రాజుకన్న కవిరాజు ప్రతిభాశాలి అని ఋజువు చేసిన తెల్గు వీరుడు. తన ఆశీస్సులతో నందనవనాలను— తన శాపాలతో స్మశానవాటికలను సృజించి కవి అపర బ్రహ్మ అని సార్థకం చేసిన కవివీరుని కథ. రంగానుకూలమైన రసవత్తర నాటకం. వెల రు. 1—8—0


ప్రాప్తిస్థానం

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,

సంస్కృతాంధ్ర బుక్ డిపో (స్థాపితం 188౪) రాజమండ్రి.

శ్రీ [illegible]శ్వరి ప్రెస్, [illegible]మహేంద్రవరం.